## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050016197

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# మణిమాల

(ఉన్నతపాఠశాలలయందలి యున్నతకక్ష్యల కుద్దిష్టము.)

కర్త:

ఉ॥ భా॥ ప్రవీ॥, దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి,

ఆంధ్రసంస్కృతపండితులు.

M, S. N. Charities High School, KAKINADA.

1950

ప్రకాశకులు:

మాదిరెడ్డి జగన్నాథరావు అండు కో

ఎడ్యుకేషనల్ పబ్లిషర్సు,

కాకినాడ.

కాపీరైటు] [మూల్యము రు 0-14-0.

# ఉపోద్ఘాతము

ప్రస్తుతకాలమున మనప్రభుత్వమువారు బాలబాలిక లను మంచిపౌరులనుగా దయారుచేయుటకై యెంతో పాటు పడుచున్నారు. విద్యాప్రణాలికలలో నట్టినియమములనుగూడ జేర్చుచు భావిభారతపౌరులనుగా విద్యార్థులను దయారుచే యుటయం దెంతేని శ్రద్ధతీసికొని తత్కార్యముల నాచరణలో నుంచుచున్నారు.

దాని కనుగుణముగా "నేఁటివిద్యార్థు లెట్టినియమము లను నిత్యజీవితములో పాటించవలెను? ఎట్టినీతులను తమ విద్యార్జనముతో పాటు నేర్వవలెను? వారు దేశభక్తి ప్రభు భక్తికలవా రెట్లగుదురు? చక్కని ధైర్యసాహసములు వారి కెట్లలవడును? పరోపకారపరాయణత, సాంఘికసేవ, వారెట్టి పాఠ్యములుజదివి యనుభవములోనికి తెచ్చికొనవలసియు న్నది?" అను నుద్దేశములు హృదయమున నుంచుకొని ఈమణి మాల ఉన్నతపాఠశాలల యున్నతరగతులకై రచించితిని.

ఇందలి మొదటికథ:- కచుఁడు-దేవయాని. ఇది భారతము నుండి గ్రహింపబడినది. స్వర్గరాజ్యము సరియైన నాయకుఁడు లేక శత్రువులైన రక్కసుల వశమగుచుండ దేవతలందఱును నాలోచించి కచుఁడను నొకయువకుని ప్రోత్సహించి వాని ద్వారా స్వర్గరాజ్యమును నిలువఁబెట్టికొనుట. మఱియు నీతని

గురుభక్తి, విషయానురక్తి మున్నగునవి బాలురవలంబింప వలసినవి. బాలురు యువకులును దేశోద్ధారకులును కావలెను.

రెండవకథ:- గుణనిధి. ఇది శ్రీనాథుని కాశీఖండము నుండి గ్రహింపఁబడినది. మన బాలబాలికల బాధ్యతలు తల్లి దండ్రులు చాలవఱకు చూచుకొనుచుండవలెను. ఈపూఁచీ యుపాధ్యాయులదని కొందఱు తలఁస్తముగానుందురు. అందు వలన బాలబాలికలు సుళువుగా దురభ్యాసములకులోనై పాడ గుదురు. వారు విద్యాలయములకడపు సమయముకన్న గృహ మందుండువేళ ఎక్కువగదా! మఱియు పిల్లలలోపములు పెద్దలు కప్పిపుచ్చరాదు. దానివలన పెక్కునష్టములు గలవని ఇది బోధించును.

మూఁడవది:- సుయోధన పరాభవము. ఇదియు భార తమునుండి గ్రహింపఁబడినది. దుస్సాంగత్యముచేయుట హాని కరము. పరుల గొప్పతనముచూచి ఓర్వలేకుండుట కూడదు. అసహనము తన్నే యడుగంటఁజేయును. ఇట్టినీతుల నిది బోధించును.

నాల్గవకథ:- కాలకవృష్ణీయుఁడు. ఇదియు భారతగాథయే. పరిపాలకులు ధర్మబాహ్యులై దేశోపద్రవముగలిగించువేళ రాజ్యమందలి ధర్మతత్పరులు చేయవలసిన కృషియేమి? ఎట్టి వారు మంత్రులుగానుండుట కర్హులు? మున్నగు ధర్మములను బోధించును.

ఈవిధమైన యాదర్శములు దృష్టిలోనుంచుకొని బాలుర క్షేమాభివృద్ధు లపేక్షించి యీపొత్తము వ్రాసితిని.

ఇందలిభాష నాతికఠినముగా నాతిమందముగా గ్రాంథికముగా వాడబడినది. లోకోక్తులు దేశీయములు వీలైన చోటుల వాడితిని. పాత్రల స్వరూపస్వభావముల ననుసరించి సంభాషణము స్వాభావికముగ వ్రాయఁబడినది. చదువునప్పుడు విద్యార్థులహృదయములు ముందునకు త్రోసికొనిపోవునట్లుగా నుండవలెను, గాని విసువు కలిగింపరాదు. ఈయుద్దేశము ఈగ్రంథమున నెంతవఱకు సఫలమైనదో సహృదయులు నిర్ణయింతురు గాక! ఈకృతి సర్వదా బాలురకు చక్కనినీతులను బోధించి కాలానుగుణమైన శిక్షను దేశోపయోగకరమగు నట్లీయగలదనియు, వారిని మంచి భావిపౌరులనుగా దయారుచేయఁగలదనియు, దేశభక్తి, ప్రభుభక్తియు పురికొల్పి వారినడవడిని చక్కగ దిద్దుననియు నా నమ్మకము. సహృదయులు, పండితులు, విద్యాధికారులును, ఈగ్రంథము నుద్ధరించి నన్ను ప్రోత్సహింతురుగాకయని నమ్ముచున్నాను.

ఇట్లు విధేయుఁడు,

గ్రంథకర్త.

# మణిమాల



## కచుఁడు:—

కం॥ గురుభక్తి కళారత్నా
కరతరణము; శిష్యజీవికావరణంబై
గురుభక్తి కలుగువారల
కరుదే సకలార్థసిద్ధి యగుట ధరిత్రిన్.

గురుశబ్ద మేనాఁటిదోగాని మిగుల పవిత్రమైనది. మిక్కిలి యున్నతమైనది. చాల బరువైనది యెంతో గొప్పతనముగలది. హిమవచ్ఛిఖరముపై నున్నతముగా నిలిచి గాలికిఁ గలకలలాడు పతాకవంటిది గురుపదము. దీనిఁ జూచుటకుఁ గాని దీని వెల కట్టుటకుఁగాని యేరికిని శక్యముగాదు. తుదకు మన దేహమును, మనయాత్మను, మనలోని జ్ఞానజ్యోతిని గూడఁ బ్రసాదించిన దీ గురుశబ్దమే. ప్రపంచము నెల్లఁ బిడికిటఁ బట్టి పిండఁగల శక్తిగలదీ దివ్యపదము. ఇందుఁ బరహితమే యెల్లవేళల గోచరించుచుండును. ఇట్టి పవిత్రనామము ధరించిన వారే గురువులు. పరమగురువులు.

అట్టి పూజ్యులపై నిశ్చలమైన భక్తిగలవారికి విద్యాసముద్రము మోఁకాలిబంటి. గురు కరుణ వజ్రకవచము.

వేమేల ? అమరజీవిని జేసినను, అమృతజీవిని గావించినను, మానికమును మసిబొగ్గొనర్చినను, మసిబొగ్గును మానికము గావించినను గురులే వలంతులు. అట్టి మహాత్ములకుఁ ద్రికాల వందనములు శిష్యశ్రేణి చేయవలసియున్నది. ఇది స్వార్థసిద్ధికి మూలము.

పూర్వము దేవతలకొక గురువును, దానవులకొక గురువు నుండెడివారు. దేవగురుఁడు బృహస్పతి. ఈతఁడు మహా మేధావి. కావుననే 'బుద్ధికి బృహస్పతి' అను నార్యోక్తి గలిగినది. దానవగురుఁడు శుక్రుఁడు. ఈతఁడు నీతికోవిదుఁడు. 'శుక్రనీతి' అను మాట యీతని వ్రాఁతవలననే గలిగినది. వీరొకరి నొకరు మించిన యున్నతియుఁ బ్రజ్ఞయు మహిమయుఁ గల మహాత్ములు.

ఆనాఁడు దేవదానవులను రెండు తెగలవారును పానీయ ములు సేవించుచుండెడివారు. దేవతలు త్రావు పానీయము 'సోమరసము' అను పేరిట వేదకాలమునుండియు వాడుకలో నున్నది. 'మద్యము' అను పేరిట క్రవ్యాదుల పానీయము వ్యవహరింపఁబడుచున్నది. ఆ పానీయములను వారు గ్రోలి ఆనందమునో, తన్మయత్వమునో, మత్తునో, యనుభవించు చుండెడివారు.

అందు రాత్రించరులు సురాపానము మితిమీఱి చేయు చున్నట్లు మన పురాణములు చెప్పుచున్నవి. వీరల గురువగు శుక్రుఁడుగూడ సహవాసదోషముచేతనో యేమో, అమిత

ముగా మధుపానమొనర్చుచు, నెల్లవేళల పాప్రపంచదృష్టివీడి తనమానసమును దైవధ్యానమందు లగించుచుండెడివాఁడట. ఆకారణముచే నాతఁడు విద్యార్థులకుఁ జేయు బోధయు మిగుల సక్రమముగా నుండెడిది. మొత్తముపై న్యాయభ్యాసను శుక్రునకుఁగూడ సుతిమించి రాగమునఁ బడినట్లే యుండెను.

దేవతలకును రక్కసులకును విరోధము పుట్టుకలో నుండియు నున్నదే. విరోధము కలహములకుఁ గారణముగదా! దేవదానవుల కట్టి మహాసంగ్రామము లెన్నోపర్యాయములు సంభవించుచుండెను. ఒకరిరాజ్యము నొకరాక్రమింపవలెనను రాజ్యకాంక్షతో నేఁటి యాయోధనములు ప్రవర్తిల్లుచుండ, మాత్సర్యము, విరోధము కారణముగా నాఁటి సంగ్రామములు సంభవించెడివి. రక్కసులుక్కుమీఱి దేవలోకముపై నెన్నియోమారులు దండెత్తిరి. దేవతలు వారి నెదుర్కొనుచు పోరాడి తమ తమ హక్కులను గాపాడుకొనుచుండిరి. కాని రాక్షసగురుఁడగు శుక్రుఁడు గొప్పమహిమ గలవాఁడై, మంత్రవేత్తయై, యాహవములందుఁ జచ్చిపోయిన రాక్షసులను పునర్జీవితులుగఁ జేయుచుండెను.

ఈనాఁటి నవనాగరిక ప్రపంచమున నెన్నియో విచిత్ర పరిశ్రమలు. గొప్పగొప్ప శక్తులు, సామర్థ్యములు, వివిధము లగు పరికరములు నేర్పడి మన సంఘమెంత సుఖపడుచున్నను జచ్చినవారిని బ్రతికించు విద్య నెవ్వరును కనిపెట్టలేకపోయిరి. మన పూర్వగాథలను బరిశీలించినచో నీమహావిషయము

మంత్రములమూలమున మహర్షులు సాధించినట్లు స్పష్టమగు చున్నది. దీనినే వారు 'మృతసంజీవని' అని వ్యవహరించెడి వారు. ఈ మహామంత్రమును చేబట్టి శుక్రాచార్యుడు తనాశ్రయించిన రాక్షసులకు మరణమనునది లేకుండ జేసి పరోపకార పరాయణుడై యుండెను.

ఈ కారణమువలన దేవతలెంత శ్రమపడి రక్కసులను సంహరించుచున్నను గురుదేవులకరుణచే నసురులు తిరిగి సులువుగా జీవించుచుండిరి. దేవతలకట్టి సామర్థ్యములేమి వారిలో జచ్చినవారు చచ్చినట్లే యుండిపోవుచుండిరి. దీనిచే దైత్యుల సంఖ్య మితిమీరిపోవుచుండెను. విబుధుల సంఖ్య క్రమక్రమముగా క్షీణించుచుండెను. అప్పుడు దేవతలలో గొందఱు బుద్ధిమంతు లిట్లని వితర్కించికొనిరి.

"సంఘక్షేమమే దేశక్షేమము. జాతిని కాపాడుటే దేశమును సంరక్షించుట. ఏదేశమందు సంఘములకును జాతులకును భద్రత వాటిల్లదో యాదేశ మెన్ని సంపదలతో దులతూగుచున్నను వ్యర్థము. ఆదేశపు రాజెంత సమర్థుడైనను నసమర్థుడే. కాన వివేకముగలవారు సంఘక్షేమమూలముగా స్వదేశాభివృద్ధిని కాంక్షింపవలెను. స్వజనసేవయే దైవారాధనము. స్వదేశరక్షణమే పురుషార్థములలో ముఖ్యము. ఈకృషిలో ప్రజలెన్ని యవాంతరములనైన దాటవలసి వచ్చును. ఎన్ని యిబ్బందులైన పడవలసివచ్చును. ఆగండము

లన్నియు దాఁటి చిరకీర్తి నార్జించుటయు, జన్మసాఫల్య మందుటయు ప్రతివ్యక్తికిని ముఖ్యము.

చచ్చినవారెల్ల బ్రతుకుచుండినచో నీ రాకాసిమూకల నింక నెవఁడు జయింపఁగలఁడు ? వారలెంత పుణ్యాత్ములో ? చావనునది లేక నిత్యసంతుష్టులై యున్నవారు. సంతుష్టి నిహపర సౌఖ్యములనందును గదా ! "తన సంతోషమె స్వర్గము, తన దుఃఖమె నరక" మని పెద్ద లనియున్నారు. ఆనందముతో సమానమైన దేదియు లేదు. అట్టి యానందమున కేనాఁడో వారు పెట్టిపుట్టిరి. ఐనదైనది. పెరవారల వృద్ధిని గాంచి విచారించుట వెఱ్ఱితనము. ఎదిరి పచ్చదన మోర్వలేని స్వభావము జీవుల నధమగతికిఁ దెచ్చును. ఐనను పూర్వదేవులు మనకు గర్భశత్రువు లగుటచే మన మింతగా వారి నాశనమునకై విచారింపవలసి వచ్చినది. అగ్నిశేషమును, ఋణశేషమును, శత్రుశేషమును నిర్మూలము కావింపవలెను; లేనినాఁడు ప్రమాదము వాటిల్లి మొదటికే మోసమగును. వివేకము గలవాఁడు శత్రువుల హతమార్చి దేశమును నిష్కంటకముగాఁ జేయవలెను.

కావున మనమిప్పు డెవ్వనినైన తగినవానిని పంపి యీ యమృతసంజీవినీ విద్య శుక్రునినుండి తేవలెను; లేనిచో దినదినము మనసంఘమునకు మరణము తప్పదు. ఈ మహాయుద్ధమింకను ఎంతకాలముండునో యెవ్వ రెఱుఁగుదురు? సంఘబలము తగ్గినకొలఁదిని పోరులం దపజయము సంభవిం

చును. మనమిప్పుడు మన క్షేమమని యూరకున్నచో ప్రమాదము తప్పదు. రాక్షసలోకమునకేఁగి శుక్రుని నారాధించి యావిద్య ను మనకందించు దిట్ట మనలో నిపు డెవ్వఁ డున్నాఁడు. అట్టి మహాసత్త్వుని విచారించి పంపించవలెను" అని యనుకొనిరి.

అంత వారలకుఁ దమ గురువగు బృహస్పతి బుద్ధికి తట్టెను. మఱికొందఱి కాతని పుత్త్రుఁడును ధీమంతుఁడును, యువకుఁడు నగు కచుఁడు గోచరుఁ డయ్యెను. కచుఁడు తం డ్రిని మించిన బుద్ధిగలవాఁడు. తేజశ్శాలి, అతఁడే యీపని సాధింప సమర్థుఁడని పలువు రభిప్రాయము వెలిబుచ్చిరి. అప్పుడు దేవతలెల్లఁ గచుని సమీపించి యిట్లనిరి.

"నాయనా! మేమందఱము కట్టికట్టుకొని యొక కార్య ము నిమిత్తమై నీచెంత చేరితిమి. నీవు యువకుఁడవయ్యు, బుద్ధికి బృహస్పతిని మించినవాఁడవు. నియమనిష్ఠలలో నీ తండ్రిని గూడ మెప్పించినవాఁడవు. నీ ధర్మములను నీవెన్న డతిక్రమించినవాఁడవు గావు. పెద్దలన్న మిగుల నడకువయు, భక్తియు గలవాఁడవగుటచే నిన్నిప్పు డర్థింప వచ్చితిమి. నీవు దాని కియ్యకొని యీ సంఘోపకారము నొనర్చి మనదేశము నకు శాంతిభద్రతలను జేకూర్పుము. దీనివలన నీకీర్తి యుగ యుగముల వఱకు మారోగును. వివేకివగు నీ కింతకన్న బో ధింపవలసిన దేమియు లేదు అదే మందువా వినుము.

చిరకాలమునుండి మనకును దానవులకును జరుగు చున్న పోరు నీవెఱుఁగనిది కాదు. రాక్షసుల బలపరాక్రమ

ములు గూడ నీకుదెలియును. వారు యుద్ధములందు మడిసియు
అమృతసంజీవనిచేతను, గురుకరుణచేతను తిరిగి బ్రదుకుచు
న్నారు. నేఁడు వారిని సహించుట మిగుల భారముగానున్నది.
ఇంద్రాది దేవతలెల్ల పరాఙ్ముఖులై కయ్యమునకు వెనుకంజ
యిడుచున్నారు. ఇంతేగాక మనకా విద్య లేనికారణమున మన
వారెల్ల యమసదనమున కరుగుచున్నారు మన బలపరాక్రమ
శక్తులెల్ల దానిముందు అడవిగాచిన వెన్నెల యగుచున్నవి.
కావున నీవేఁగి యా మహావిద్యను సాధించి తేవలెను ఇట్టి
కష్టపుకార్యము సాధింపఁగలనాయను సందియము నీకువలదు.
నీవు మహాతపశ్శక్తి సంపన్నుఁడవు. బాలుఁడవయ్యు నియమ
వ్రతశీలుఁడవు. నిన్నాశుక్రుఁడు తప్పక ప్రేమించి యావిద్య
నీకొసఁగఁగలఁడు. దీన సందియము లేదు. మేమెల్లర మట్టి
యాశీస్సు నీకొసఁగుచున్నారము. దీనికి నీవెదురాడ వలదు.
ఇది దేవకార్యము. నీవావిద్య తెచ్చితివేని యీసురనికాయము
నెల్ల మృత్యుముఖమునుండి తప్పించినట్లే. ఈపని జరిగిననాఁడు
జయము మనదే.

మఱియొక రహస్యము. శుక్రున కొక్క- కాకొక్క-
తియ కూఁతురు. ఆమెపేరు దేవయాని. ఆతఁ డామెయం
దత్యంతాదరము గలవాఁడు. ఆమె నల్లారుముద్దుగా నాతఁడు
పెంచికొనుచు గీచినగీటు దాటక యామె కోరికలెల్లఁ దీర్చు
చుండును. తన ప్రాణములకన్న నాతని కా కుమార్తె యధిక
రాలు. దుహితృస్నేహముచే నామెను కాదని యాతఁ డెట్టి

కృత్యమును చేయనొల్లఁడు. కాన నీవా యిరువురను, నీ భక్తి శ్రద్ధలను, నీ కర్మనిష్ఠయు, నీ శుశ్రూషాపరాయణతను, నీ నేర్పు నెల్లఁ జూపి మెప్పించి యాతని చిత్తము వడసి యారాధింపవలెను. శుక్రుఁడు దేవయాని యానతి జవదాటువాఁడు కాడు గాన నీవు నీ యావచ్ఛక్తి వినియోగించి యామెచిత్తము నాకర్షింతువేని నీకిష్టసిద్ధి యగును" అనిరి.

ధీమంతుడైన కచుఁడును దేవతల కెదురాడక వారి ప్రార్థన మంగీకరించెను. ఈ దేవహితము నొనర్ప నాతఁడెంతో యువ్విళ్ళూరెను. కాని ఫలితముపై మాత్ర మాతనికి సందియము, భయము లేకపోలేదు. మాయావులగు రాక్షసుల తోడి సహవాసమును, గురుపుత్రికద్వారా గురువులను మెప్పించుటయు, మహావిద్యను నేర్చుటయుఁ దనబోఁటివాని కసాధ్యములన్న నిరాశ యాతని మనమును బీఁకుట మానలేదు. కాని యాతఁడా దేవతాసంఘమునకు నమస్కరించి తగుదీవనలంది స్వజాత్యుద్ధరణమునకై బద్ధకంకణుఁడై రానున్న యెన్నిబాధలనైన నోర్చి మృతసంజీవనిని దేవలెనని యొక మంచి ముహూర్తమున బయలుదేఱెను. పోవునపుడాతని ననుగమించుచు దేవతలెల్ల శుభాశీస్సుల గురిపించిరి. కచుండును సర్వమంగళాస్తవ మొనర్చుచు దేవతల వీడ్కొని కతిపయప్రయాణముల రాక్షస నగరము చేరెను. అచట నాతఁడు వేదాధ్యయనశీలుఁడై, నిరతము శిష్యబృందమునకు శాస్త్రముల బోధించుచున్న శుక్రాచార్యులను సమీపించి, నమస్కరించి యిట్లు మనవి చేసికొనెను.

గురువరా ! నేనొక విద్యార్థిని. దేవలోకమునుండి వచ్చినాఁడను. నన్ను కచుఁడందురు. నేను విద్యార్థుల కుండవలసినయట్టి నియమములనుగాని, నాకులధర్మములనుగాని యేమఱువాఁడఁగాను. నా తండ్రి దేవగురుఁడగు బృహస్పతి. నా కట విద్యాదాన మొనర్పఁగలవారు లభింపమి, తమ శుశ్రూష నెఱపి శిష్యవృత్తితో తమయొద్దనుండుటకై వచ్చితిని. తమ ప్రవచనము మిన్నుముట్ట లోక లోకాంతరములకు వ్యాపించినది. మీ కీర్తివెన్నెలలు దిగంతములవఱకు నాక్రమించినవి. దాని విని కని కొండంత యాశతోఁ దమకడ విద్యాభ్యాస మొనర్పవచ్చితిని. నా శ్రమకు తాము దయఁదలఁచి నన్ను కృతార్థునిగాఁ జేయ వేఁడుకొనుచున్నవాఁడను." అని ముకుళిత కరకమలుఁడై సాష్టాంగపడి వినయవినమితగాత్రుఁడై యెదుట నిలువఁబడిన కుఱ్ఱవానింగాంచి శుక్రుఁడు తనలో నిట్లనుకొనెను.

"ఆహా! ఏమి యీతని సుకుమారత్వము ! ఏమి యీతని బ్రహ్మవర్చస్సు ! ఎంత వినయము ! పలుకు పలుకునఁ దేనియ లొలుకు నీతని వాక్చాతుర్య మెన్నఁదగినదే! ఈతని దేహకాంతికిఁ దోఁ డీతని యంగవిన్యాసముగూడ వ్రతపరాయణతను, ప్రశాంత గంభీరత్వమును సూచించి నాహృదయమునుసైత మాకర్షించుచున్నది. ఇట్టివానిని శిష్యునిగాఁ జేసికొనువానిదెగాదె భాగ్యము ! పైఁగా బృహస్పతి పుత్రుఁడఁట. దేవగురుఁడగు బృహస్పతియన్న సామాన్యుఁడా ?

జగదారాధ్యుఁ డతఁడు; నేఁడీతనిని మన్నించుట యాతనిఁ బూజించినట్లే యగును."

"నాయనా! విద్యార్థిని భోజనార్థిని పొమ్మనుట యెట్టి మొఱకునకైన కూడనిపని. అందును నీవు మాయందాసక్తితో దూరయాత్రయొనర్చి చేరితివి. నీసౌశీల్యము, నీ వినయము మాహృదయము నాకర్షించినవి. నీకుఁ దప్పక నాయొద్దనున్న విద్యలనెల్ల నేర్పఁగలను. ఏమొకో, నీయందు నాహృదయము వెన్నవలె కఱఁగినది. గురుహృదయ మాకర్షింపఁగలవాఁడే తగిన శిష్యుఁడు. నీవు నాయింట మసలి నేఁటినుండి నాశిష్యుఁడవు కమ్మనుమ నతని నాతిథ్యసత్కారములొనర్చి సంతుష్టుగాఁజేసి శిష్యుఁగాఁ జేసికొనెను. ఆతండును గురుగృహమందే నివసించుచుండెను.

అంతఁ గచుండును గురుసేవాపరాయణుఁడై మెలఁగుచుండెను. గురుపుత్రికయందుసైత మాతఁడమిత వాత్సల్యమును భయభక్తులును గలవాఁడై యుండెను. గురుదేవు లేపని చెప్పినను 'ఇదిగో చేయుదు నదిగో వత్తును' అనక క్షణములోఁ జేయుచుండెను. వారి కనుసన్నలచేతనే కార్యావసరముల నెఱిఁగి వారి చిత్తవృత్తుల కనుకూలముగ వర్తించుచుండెను. ఆతఁడు మనోవాక్కాయకర్మములచే ధర్మపరుఁడై గురుసేవలయం దేమరపాటు లేకయుండెను.

దేవయానియుఁ గచుని ప్రియహిత వాక్యములకును, నాతని సత్ప్రవర్తనమునకును మిగుల తృప్తిపడుచుండెడిది. ఒకో

క్కవేళ నామెయొద్దఁ గచుఁడు చక్కని గేయములను మృదు మధురకంఠముతో బాడుచుండెను అందలి భావమును హావ మును దన యభినయముచేతను నాట్యభంగిమల చేతను ప్రదర్శించి కచుఁడు గురుపుత్రిని దన్మయ మొనర్చుచుండెను. వేణుకవ్వాదు, ఆనద్ధము, మృదంగము మున్నగు వాద్యముల చేతను, వీణ. తిపిరికిన్నెర, స్వరమండలి మున్నగు గాన సాధ నములతోఁ దన సామర్థ్యమును వెల్లడించుచుండెను. దానికి దేవయాని మహానంద మొందుచు "ఏదియేదీ ? ఇది చాలఁ గ్రొత్తపోకడ. ఇక నొక్కసారి యాలాపింపుము. హాయి హాయి!'' అనుచు వాని గాన సుధాలహరిలో తెప్పవఁ దేలి యాడెడిది. ఒక్కొక్కతూరి రహస్యముగా నామె యాతని గొంతుతోఁ దన కంఠము మేళవించి పాడ సాహసించెడిది. ఆ యుద్రేకముతో నామె లోకమే మఱచి యొకానొక మూర్ఛా వస్థ నొందుచుండెడిది.

ఆఁడుదియనిగాని యీమె మనకుఁ బనులుచెప్పటా యనిగాని దుశ్చింత యా కచుని హృదయమునఁ బొడమను లేదు. ఆతఁడట్లు వర్తింపనులేదు. ఆమె యాతని నొకొక్క పుడు పూలు తెమ్మనియుఁ బండ్లు తేవలెనసియుఁ బంపుచుండె డిది. ఆతఁ డామెకోరిన వస్తువు లెంత దుర్గమ ప్రదేశములందు న్నను సంపాదించి యిచ్చి యామె యమ మెప్పునందుచుండెను.

పాఠ పఠనసమయములం దాతఁడు గురువులచెంతఁ గూరుచుండి విశేషములఁ జక్కఁగ గ్రహించుచు, గ్రహించిన

వానిని జింతనమొనర్చి ధారణపట్టుచు, వేళదప్పక కాలోచిత ములగు కరణీయములు నియమము తప్పక చేసికొనుచుండు వాఁడు. వెకిలిచేష్టలు, వేళాకోళములు, పలుకుదబ్బరలు, భ్రష్ట ప్రతినలు, పాపమాతఁడు కలలోనైన నెఱుఁగఁడు. సహపాఠు లతో ననువర్తనగలిగి గురు గురుపుత్రికల కాతఁడు దలఁపో నాలుక యయ్యెను.

ఇతరవేళలందాతఁ డే చెట్టునీడకో చేరి సహాధ్యాయు లకుఁ జింతనము చెప్పునపుడు ఆతనిధోరణి గాంచి గురువు లూటలు మ్రింగుచు నాతని తెలివి కచ్చెరువందెడివారు. దేవ యానితో నాతఁడు కొంత కాలముపుచ్చుచుండెను. అపుడు వారిరువురును బెక్కు సంగతులను దర్కించుకొనుచుఁ బెక్కు ధర్మములనుగూర్చి చర్చించుకొనుచుండెడివారు. వాదము ఖండించి వాదము, యుక్తికిఁ బైయుక్తి, మనసు నొవ్వకుండ యుక్తియుక్తముగాఁ గచుఁడు సదాచారములను గూర్చియు, లౌకిక విషయముల నుద్దేశించియుఁ దనయెదుట గంభీరముగ నుపన్యసించుచుండఁగా దేవయాని మక్కువతో నాతని సద్బో ధనములను వినుచుండెడిది. ఆతని బోధలందలి సారము, మాట లయందలి తేటదనము, ఆ కనుబొమల యూపులు, ఆ చేతుల యభినయములు, ఆతని దివ్యతేజము, ఆ కన్నులలోని గంభీర భావములును విని కని మహానంద మందుచుండెడిది. ఏమైనను దనకు కావలెనన్నఁ జాలును. దానిని వెనువెంబడినే సమ కూర్చుట కచున కలవాటైపోయెను. సర్వదా కచుని ముంగలఁ

కూర్చుండి యేవేవో ప్రశ్నించుచు నాతనిచేఁ బలికించుట, ఆనందించుట, ఆతనిచేఁ బనిగొనుట దేవయానికి నిత్యకృత్యము లయ్యెను. పెక్కుసంవత్సరము లిట్లు వారలవాటుపడియున్న కారణమున నామె కచునొక్క నిముషము కాంచకున్న నిలువ లేక తత్తరించుచుండెడిది. క్రమక్రమముగా దేవయాని హృదయమందలి వాత్సల్యము ప్రేమగా మారఁజొచ్చెను. కచుని భక్తిగౌరవములు మాత్రము దినదినాభివృద్ధి నందుచుండెను. వీసికిట మార్పుగలుగనేలేదు.

ఇట్టి సేవావిధానముచేతను తన నడవడికచేతను కచుఁడు శిష్యవర్గములో మిగుల ప్రాధాన్యము వహించెను. గురుదృష్టిలోఁగూడ నీతఁడు మిక్కిలి గౌరవపాత్రుఁడయ్యెను. ఈతని చెవినివేయనిదే శుక్రుఁ డెట్టి కార్యమును జేయకుండెను. వేయేల ! వారింటి కాతఁడే పెద్దయై సర్వకార్యములను జక్కఁ బెట్టుచుండెను.

ముందువచ్చిన చెవులకన్న వెనుక మొలచిన కొమ్ములు వాఁడియన్నట్లు కచుని కగ్రస్థానమా చోట లభించెను. అది రక్కసులు గ్రహించి సహింపలేక తమలో తామిట్లనుకొనిరి.

ఈ కచుఁడు మన శత్రువులగు దేవతల లోకమునుండి వచ్చినవాఁడు. విశేషించి దేవగురువగు బృహస్పతి పుత్రుఁడఁట. మనదేశములో నివసించుచు మన గురువులకడ విద్య నభ్యసించుచు, మన కూడుగుడ్డల ననుభవించుచు మన తల దన్నుచున్నాఁడు. చెప్పాట లేడవుగా సమస్త విద్యలు నేర్చు

చున్నాఁడు. అదేమోగాని వీని మాటన్న గురువుల కొడలు తెలియదు. ఈతఁడు చేరినవెనుక మన యాచార్యులవారికి మనపై దృష్టితగ్గినది. గురువు లేకాక గురుపుత్రికయు సర్వదా నాతనితో విలాసముగా విహరించుచు, నేవేవో వితండ వాదములు చేయుచు నాతనితోనే ప్రొద్దెల్ల గడుపుచున్నది. వీఁడు నంగనాచివలె సంచరించుచు మన గురుదేవులను దేవయానిని గూడ నోడిలో వేసికొన్నాఁడు. మన గురువులయింట వీనికింత చనవా? ఇంత పెద్దరికమా? వీనిపై గురువులకింత ప్రామాణ్య బుద్ధియా? మన మిట్లూరకున్నచో వీఁడు మనలో మొనగాఁడై కొంప దీయఁగలఁడు. కాన వీనికి శృంగభంగ మొనర్పవలెను. అని సమయము వేఁచియుండిరి.

ఒకనాడు కచుఁడు గురువుల హోమధేనువులను మేపుటకై యడవిపొలములకుఁ దోలుకొని పోయెను. అట నాతఁడు మోఁకాలిలోఁతు మేఁతలో నోవులు మేయుచుండ నొక చెట్టునీడఁ జేరి కూర్చుండి శాస్త్రములను వల్లించి కొనుచుండెను. క్రవ్యాదులా సంగతి కనుపెట్టి కచుని చుట్టుముట్టిరి. అపుడు కచుఁడు వారలతో నిట్లనెను.

“రండు రండు నెచ్చెలులు. గురువు లేమైన నాతోఁ జెప్పి రమ్మని మిమ్ము బంపినారా? లేక పాఠములు చింతనము చేయుటకై వచ్చితిరా? లేక యీ కచుఁడేమి చేయుచున్నాఁడో అని పరిశీలింప వచ్చియుందురా? ఈ సుందరములగు వనప్రదేశములను జూడ దయచేసినారా? కాక యాటలాడు

కుతూహలముతో నేఁడరుదెంచి యున్నారా? చెప్పుఁడు. మీ కుతూహలమెట్లో యట్లు కావింతము. ఎన్నఁడును గుంపుగూడి మీరిటకు వచ్చినదిలేదు. ఈనాఁడు మీరాక నాకిన్ని సందేహములకు తావలమైనది. తెలుపవేఁడుచున్నాను" అనెను.

అందులకు రక్కసు లొక్కుమ్మడిగా మేము నీవను కొనినవానిలో నొక్కఁడానిని గూర్చియైనను వచ్చినవారము కాము. ఒక్క విచిత్రమైన కార్యము తలపెట్టుకొని నిన్ను సమీపించితిమి. నీవు మాకు శత్రువర్గములోని వాఁడవను సంగతి మరచితివా?

కచు:— నేనా? అన్నలారా! ఏమి మీకపకారము చేసితిని? అది జ్ఞానకృతమా? అజ్ఞానకృతమా? తెలిసి చేసినదేమియు నింతవరకు లేదే? తెలియక పొనరించినదైనచో మీరది క్షమింపలేరా? మన మందఱము సచ్ఛాత్రులము, సహాధ్యాయులము గదా! అన్నదమ్ములవలె నుండవలసిన మనలో మనకు శత్రుత్వమన్న నెట్టిది?

దాన:— నీ ధర్మపన్నములు కట్టిపెట్టుము. ఎక్కడనోయుండి మాయూరుచేరి మా యుప్పుపులుసులు దినుచు నీవు తిన్నయింటి వాసములు లెక్కించినట్లు మమ్ము తిరస్కరించుచున్నావు. పుట్టుకలోనుండి వచ్చిన శత్రుత్వమీవు లేదన్న పోవునదా? మీరు అదితి పుత్రులు. మేము దితి పుత్రులము. మీరు సురలు. మే మసురు

లము. విశేషించి నూఱుకాకులలో నొక కోయిల యన్నటులు నీవిటచేరి మాగురువులకు మాపై మనసు విఱిచివేసితివి. మా దేవయానితో నీవు నేస్తముచేయు చున్నావు. కాన నిన్నుపేక్షించినచో మాకు ముప్పు తప్పదు. కాన నిన్నిట బలవంతముగ........

కచు:—ఏమి మీప్రసంగములు? కలలోనైన నే నీరీతి నెఱుంగనే. గురుల మనసు విఱిచితినా? గురుపుత్రియగు సోదరితో........ అన్నన్నా! ఎంతెంత మాటలాడు చున్నారు? అన్నలారా! విద్యార్థినై మీలోకమునకు వచ్చి మీగురువుల సేవించుచుంటిఁ గాని కుచ్ఛితకార్యము లొనరింప వచ్చినవాఁడఁగాను. ఎన్నడును కని విని యెఱుఁగని యీ తలంపు లేల? ధర్మమాలోచింప వలదా!

దాన:— ధర్మమా? మాకిదే ధర్మము. నిన్నిపుడు బలవంతముగఁ జంపఁదలఁచి వచ్చితిమి. అని దారుణముగ మీఁదికి విఱుచుకొని పడిరి.

కచు:—అన్నలారా! మీరు చంపఁదలఁచినచో సరే చంపుడు. అందులకు నేను భయపడను. కాని గురువుల హోమధేనువు లిట మేయుచున్నవి. వానిని మాత్రము భద్రముగా గురునిల్లు చేర్పుడు. లేనిచో గురుదేవుల హోమకార్యము లడ్డిపోవును. వారు గోపింతురు.

దాన:— నోరు మూయుము. నీపాటిగురుభక్తి మాకును

గలదు. శనిగ్రహమువలె మాలోకమునకు వచ్చి లేని పోని దుశ్చేష్టలా నీకు? అని కచునిపైఁ బడి యాతని గొంతునొక్కి బలవంతముగఁ జంపివైచి యథేచ్ఛ ముగా గ్రామము చేరిరి.

అంత కొంతవడికి సూర్యాస్తమయ మయ్యెను. వన ప్రదేశములను విడిచి ధేనువులు గ్రామోన్ముఖములగుచుం డెను. సందెచీకట్లు మెలమెల్లనఁ జెట్లచాటుననుండి విస్తరి యావరించుచుండెను. శుక్రుని గోవులును గృహము చేరెను. కాని యెప్పటివలె ధేనువులవెనుక కచుఁడు రాలేఁదు. దేవ యాని తమ యావులను గట్టుకట్లలకు బంధించి కచుని రాక కెదురు చూచుచుండెను. గడియ చూచినది; జాము చూచి నది. కచుని జాడలేదు. అంత నామె "ఎన్నడును ధేనువులను విడిచి యాలసించువాఁడు కాడే! ఈదినమెంత సేపటికిని కచుఁడు రాకున్నవాఁడేలకో? ఈనట్టడవిలో నాతని కేకీడును మూడ లేదు గద! లేక యేయేటి యొడ్డుననైన సంధ్యావందన మొన రించి కొనుచు నాలస్యము చేసెనా! ఐన నింతసేపు సంధ్య యా! గోవుల మోములుచూడ విచారము పొడగట్టుచున్నది. నాహృదయములో తాయి పడినట్టులున్నది. భోజనము వేళ గూడ దాఁటిపోయినది. కచుఁడు రాఁడు. నామనసు శోకించ దున్నది. ఐనను నాన్నగారి కీసంగతి నివేదించెదను" అని యను కొని జనకుని సమీపించి యిట్లనెను. "తండ్రీ!

ఉ: వాఁడిమయూఖముల్ గలుగువాఁడపరాంబుధిఁ గ్రుంకె ధేనువు
 ల్వేఁడిలవచ్చె నేకతము; నిష్ఠమెయిన్ భవదగ్నిహోత్రముల్
 పోఁడిగ వేల్వఁగా బడిమెఁబొద్దును బోయెఁగచుఁడు నేనియున్
 రాఁడు; వనంబులోన మృగరాక్షసపన్నగబాధ నందెనో?

జనకా! నాకేమియుఁ దోఁచకున్నది. కచునిజాడ తెలియ నెవరినైనఁ బంపుమనెను.

అంత శుక్రుఁడును "అమ్మా! ఎవరినో పంపనేల? నా దివ్యదృష్టిచేఁ గాంచి నాతఁ డెక్కడనున్నను రప్పింతును. వనమృగములచే నొకవేళఁ జంపఁబడినను నా మృతసంజీవనీ విద్యచే నిముషములో బ్రతికించెదను. చూడుము" అనుచు నాతఁడు ధ్యానముద్ర పట్టి కన్నులుమూసి ముల్లోకములను దన మనోనేత్రముచే వెదుక మొదలిడెను. అంత నాతనికి సత్యము గోచరమయ్యెను. వెంబడినే తన మృతసంజీవని నభి మంత్రించి శిష్యుని దోడితెమ్మని పంపెను. అదియును బ్రసాదంబని యతిత్వరిత గతింజని విగతజీవుఁడై యొకచోట బడిపడియున్న కచునప్పుడే బ్రతికించి యింటికిఁదోడితెచ్చెను.

అంత నాతనిగాంచి శుక్రుఁడును దేవయానియు నెంతయు సంతసమందిరి. పదంపడి గురుపుత్రియు నాతని వలన జరిగిన విషయమంతయుఁ దెలిసికొని మిగుల విచారించి నాఁటి నుండియు గచుని మఱింత ప్రేమతోఁ గాంచుచు దూరపు పను

లు చెప్పుట మానుకొనెను. పశుపాలనముకై వేఱొకని నియోగించెను.

కచుఁడు తమ గురువుచేఁ దిరిగి బ్రతికింపఁబడుటయు, నాతనిని పూర్వముకన్న మఱింత ప్రేమతోఁ గాంచుటయు, కౌణపులు చూచి మనసులలో గుములు చుండిరి. మఱియు తా మొనర్చిన యకృత్యము గురువులకుఁ దెలిసిపోయె ననియు బాధ పడుచుండిరి. ఏది యేమైనను లభించినచోఁ దిరిగి కచుని వనిపట్ట వలెననియే వారు వేచియుండి యా యూహ పైకి పొక్కనీయక యతిరహస్యముగా నుంచి యథారీతిని సంచ రించు చుండిరి.

ఇట్లు చాలకాలము గడచెను. తిరిగి యొకనాఁడు కచుఁ డెవరికిఁ దెలుపకయే యొంటరిగా సమిధలు, దర్భలు, పువ్వులు, ఆకులను దెచ్చుటకై దూరమందున్న యడవికి వెడ లెను. రాత్రించరు లాయదను గనిపట్టి వెంబడించి యదరి పాటున వానిని మడియించి కడి కండలుగఁగోసి తోడేళ్ళ కాహారముగాఁ బెట్టి యేమి యెఱుఁగని వారివలె తిరిగివచ్చి మసల మొదలిడిరి. మరల కచుని రామియు, దేవయాని విలా పములును దీవరింప శుక్రుఁడు తన మృతసంజీవనీవిద్యచే నాతని కాయు వొసఁగెను. తోడనే కచుఁడు వృకముల దేహ ములను ఛేదించి స్వస్వరూపము దాల్చి వచ్చి గురుల కానం దము కూర్చెను. గురుపుత్రికయు నాతనితో మిగుల తీవ్ర ముగ "నీవీ పై నాకెఱిగింపనిదే దూరముగాఁ బోరాదు.నిన్ను

జూడక నేనొక నిముషమైన మసలలేను. నీయునికి యిక్కడి వారికి మిగుల కంటకముగా నున్నది. నీవిల్లు దాటి యెక్కడికిని పోవలదని" నియమించెను.

అతఁడును గొంతకాల మామె చెప్పినట్లు నడచెను. కాని ప్రారబ్ధ మనుభవింపక తీఱునా? ఒక దినమున తనగురువుల హోమధేనువు మెల్లమెల్లనఁ దిరుగుచు మేయుచు నుండెను. దాని లేఁగయుఁ జెంత చెంగుచెంగునఁ బరువు లిడుచుండెను. దానిని గట్టిపెట్టవలెనని కచుఁడు వెన్నాడెను. అదియు జివ్వ జిన్వన విడిచిన బాణమువలె దవ్వు దవ్వులకు పఱుగులెత్తి తనతోపాటు కచునిగూడ నాకర్షించెను. క్రమముగా వత్సమును శిష్యుఁడును గ్రామ పరిసరములు దాటి పోయిరి.

వెంబడినే మాయలమారులగు రక్కసులు కూడి పలుకుకొన్నవారై యీతూరి యింక కచుఁడు తిరిగి పుట్టకుండ నుండవలయునని పూనికతో వాని నట వధించిరి. కొందఱట చితినిపేర్చి కచుని దేహము బుగ్గిగానొనర్చి యాబూదిని సురలో కలిపి తెచ్చి గురువులకు త్రాగనిచ్చిరి. అతఁడా మాయ నెఱుఁగక పూర్ణముగా ద్రాగివేసెను.

శుక్రుఁడవ్వేళ సురాపానముచే నొడలెఱుఁగక యుండెను. దేవయానియుఁ గచుఁ గానక మిగుల వనవుచు, "సీతఁడు మరల నసురులచేఁ జంపఁబడియుండవచ్చును. అసహన పిశాచ మెంతపనికైన నొడికట్టునుగదా ! విద్యార్థియై యాసుకుమారి

యిచటికిచేరినాఁడు. అన్యము పుణ్యము నెఱుఁగఁడు. తన విద్యాభ్యాసము, తన చింతనము, తన పాటలు, తన మాటలు తప్ప పరులగొడవ లేనియు నాతని కవసరము లేదు. నిరపరాధి, నిత్యసత్యవ్రతుఁడు, ధర్మకర్మతత్పరుఁడు. అట్టివానిపై యన్యాయముగా రక్కసులు పంతగించి యాతని జంపుచున్నారు. కటకటా! ఎంతదురంతము. 'పుట్టగవచ్చిన గుణములు కట్టెలతోఁగాని పోవు కలుషాత్ములకున్' అన్నటులు వీరి యాశయములు గుప్పెడు బూడిద యగువఱకును పోవునవికావు" అని యనేకవిధముల శోకించుచు యథారీతి తండ్రికీ సంగతి వివేదించికొనెను.

అంత శుక్రుఁడును కొమరిత నోదార్చుచు మంచి మాటలతో నామె కిట్లనెను "అమ్మా! నీవు దుఃఖింపఁబని లేదు. మనకేగదా మృతసంజీవనిగలదను నూహచే రక్కసులు గర్వాంధులై యున్నవారు. వారు మన కచునిపైఁ బగబూనిరి. ఏమిచేయఁగలవారము? క్రోధ మనర్థములకు మూలమని నే నెన్నిసారులు బోధించినను వారు సుంతైన గ్రహింపకున్నారు. ఇట్లెన్నిలసవులైనను వా రాతని మడియింపకమానరు. పోనిమ్ము ఆతఁడు వారలచేతఁ బడినను స్వర్గసుఖ మనుభవింపఁగలఁడు. కాన నీ వాతనికై శోకించుట వెఱ్ఱితనము. నీపరితాపము చూడలేక నేనాతని బ్రతికించుటయు, రక్కసులు పట్టుపట్టి సమయ మరసి వానిం దెగటార్చుచుండుటయు తిరిగి పునర్జీవితు గావించుటయు నిదియేనా మనపని? ఊరకుండుట లెస్స."

ఆమాటలకు దేవయాని మఱింత బాధ చెందుచు "తండ్రీ! నీవు సమస్త ధర్మము లెఱింగినవాఁడవు. కచుఁడన్న సామాన్యుఁడుగాఁడు. అతఁడు మహా ధీమంతుఁడు. అంగిరసు నంతటివాని మనుమఁడు. దేవగురువగు బృహస్పతి పుత్రుఁడు. విశేషించి మనల నాశ్రయించియున్నాఁడు. మీకు శిష్యుఁడు. తన బ్రహ్మచర్యమునం దపవిత్రుఁడై యెన్నఁడును ధర్మాతిక్రమణ మొనర్చువాఁడు కాఁడు. అట్టి పుణ్యాత్ముఁ డకారణముగా రాత్రించరులచేఁ జంపఁబడుట యెంత యధర్మము ? అట్టివానికై నేను విచారింప కెట్లుందును ? వాఁడు నాకంటఁబడువఱకును నే నాహారము నొల్లను" అని వెక్కి వెక్కి యేడ్చుచు రిత్తనేలపైఁబడి యిటునటు పొరలుచుండ శుక్రుఁడు ప్రసన్నుఁడై "తల్లీ! నీ విట్లు చెప్పినమాట వినక విచారించుచుండుట నాకేమియు బాగున్నదికాదు. నీవుగాక నాకెవ్వ రితరులు గలరు ? నే నింక నెవరిగాంచి సంతసింతును. కచుని జాడ తెలిసెదను. లెమ్ము విచార ముడుగుము. ఇదిగో యీ కమండలువులోని జలముచే మోము గడిగికొనుము. లెమ్ము. భోజన మొనర్పుము. అని యనునయించుచుఁ దన యోగదృష్టితో బ్రపంచము నంతయుఁ బరికించుచుండెను. ఎక్కడను వానిజాడ లేకుండెను. అంత నాతఁడు తనలోఁ దానొకసారి కాంచెను. అప్పుడు భస్మమయుఁడై సురలో కలిసి తన పొట్టలోనున్న కచుఁ డాతనికిఁ గనుపించెను. అంత నాతఁడు "కటకటా ! ఈ సురాపానము ఎంతపనిచేసినది ? ఎన్నో జన్మములనుండి సంపాదించిన

పుణ్యము, పెక్కుధర్మముల నాచరించి యార్జించిన సుకృతము, కష్టతరమగు తపస్సుచేసి పొందిన దివ్యజ్ఞానము, మహాత్ముల దివ్యబోధలవలన లభ్యమైన విజ్ఞానము, మొదలగు నవన్నియు నీమద్యసేవనముచే నడుగంటినవి. ఇట్టి దుష్కార్యము రాత్రించరులు కావింతురని కలనైనఁ దలఁపనైతిని. దురభ్యాసము చేటు వాటిల్లఁజేసి తీఱునుగదా! నావంటివాఁడే యిట్లు మందమతియైపోవ తక్కినవారిమాట చెప్పనేల? నావలె పరులు ఈ మద్యపానముచే మతిచెడి పతితులై భ్రష్టులు కాకుండ నేనిప్పుడొక కట్టడిచేసెదను. లేనిచో, లోకము దుఃఖముల కాకరము కాకమానదు. మన యనుభవముచే లోకు లేల యుపకారమందరాదు? ఈ యనుభవమును లోకమునకుఁ జాటి చెప్పినచో నావలె వారు ప్రమాదపడరు. ఇదియే, మహర్షులు చేసియున్న లోకసేవ. నేనును ఆదారినే పట్టెదను." అని యాలోచించి బ్రాహ్మణులాదిగ నెన్నివర్ణములు గలవో యూజాతులవా రెవ్వరైననుసరే నేఁడుమొదలీ సురాపానము గావించినచో వారు పాపాత్ములై పతితులయ్యెదరుగాక. ఇదియే నేనుచేయు కట్టడ. దీనిని ప్రజలు మీఱజాలకుందురుగాక" అని తన యుదరములోనున్న కచుని జీవింపుమనుచు మృతసంజీవనీ ప్రభావముచే నాతని బ్రతికించెను. కచుఁడును గురుల గర్భమందు బ్రతికి శుక్రున కిట్లనెను.

గురుదేవా! మీ పూర్ణానుగ్రహమువలన దేహమును జీవమును, సత్త్వమును గూడఁ బొందితిని. నేను తమ యుదర

మున యథా పూర్వరూపముతో నున్నాను. తమ కుక్షినుండి వెలువడు మార్గము లోఁచకున్నది. స్వామీ! నారుపోసిన వారు నీరు పోయకుందురా! తామే నేను వెలికి రాఁగల తెరువు నానతీయ వలయును" అనెను.

దానికేమియు తోఁచక శుక్రుఁడు తనముద్దుకూఁతును బిలిచి "అమ్మా! తెలిసితివా! మద్యపానము మనకొంపముంచినది కచుని జంపి బుసిచేసి యీ మాయరాక్షసులు సురలోఁ గలిపి నన్ను త్రావించిరి. కచుఁ డిప్పుడు నాయుదరమున జీవించి యున్నాఁడు. అతఁడు వెలికి రాఁగలుగు నుపాయము తోఁచ కున్నది. పొట్టఁ జీల్చుకొని రప్పింతునా, నేను మరణించుట నిక్కము. లేదా, కచుడు నాపొట్టలో జీర్ణము కావలసిన వాఁడగును. తల్లీ! ఈరెండు పనులయందు నీకేది సమ్మతమో చెప్పుము. కాదుకూడ దనిన వానికై నేనే మరణింతును." అని యూరకుండెను.

దేవయానియు తండ్రిమాట లాలించి "అయ్యా! నన్ను పరీక్షించుట కిట్లు పలుకుచున్నారా? నా యాత్మయు, దేహమును, నాసర్వస్వమును తమ హృదయమునుండి వెలువడినవి కావా? తమకన్న నాప్రాణములైనను నాకు రుచింపవన్న చో కచుని సంగతి వేఱె చెప్పవలెనా? జనకా! నిన్నగాక మొన్న వచ్చిన కచునిపై నాకు మిగుల వాత్సల్యమున్నమాట నిజమే. ఐనను మీ యిరువురకును ప్రమాదమురాని యూహ యొకటి చెప్పెదను. ఇపుడు గర్భస్థుఁడైన మీ శిష్యునకు

మృతసంజీవనీవిద్యను ప్రసాదింపుఁడు. తమ యుదరమును చీల్చి వెలికివచ్చిన వెనుక యూతఁడు తమరిని బ్రతికింపఁ గలఁడు. ఇట్లొనర్చిన మీ యుభయులకును గుశలముగలుగును. నా కోరికయు నెఱవేరును" అనెను.

అంత శుక్రుఁ డామెతో "అమ్మా! యీవిద్య పరులకు జెప్పరానిది. అందును మనవాఁడు శత్రుకోటిలోని వాఁడుగదా! ఈతని కుపదేశించినచో మన యహితులకు క్షేమము కలుగుట తథ్యము. అదియుఁగాక నా యుదరము చీల్చుకొని వెలువడిన యూతఁడు తిరిగి నన్ను బ్రతికింప నిచ్చగించునన్న నిశ్చయ మేమున్నది. ఆ విద్యతో నాతఁడు తన లోకమునకు బోయినచో మనలోకమునకు చేటు వాటిల్లదా? మనచేత నుండి యీవిద్య జాఱినట్లే యగును. అంతేగాక మన రక్కసులు నాచావుచే బ్రతుకుతెరువు లేనివా రగుదురు. దేవతలు మృతిలేనివారై వీరినోడింపఁ గడంగుదురు. ఈ యనర్థముల నాలోచించి నీవేదారి త్రొక్కుమన్న నాదారిని పట్టెదను." అనెను.

"తండ్రీ! భూత భవిష్య ద్వర్తమానముల కరతలామలకమువలె కాంచు ధీమంతులగు తమకు నేనా చెప్పుదానను? ఒక్కసంగతి మాత్రము ఘంటాపథముగా నొక్కి వక్కాణింతును. తమ శిష్యుఁడగు కచుఁడు ద్రోహముచేయుట మాత్ర మసంభావ్యమని యనఁగలను ఆతని నడవడిక పెక్కు సంవత్సరములనుండి మన మిరువురము కనుచున్నారము. పల్లెత్తు

మాట తూలిన వాఁడుకాడు. గోరంత దుశ్చింత లేనివాఁడు. ఆతని హృదయము పరమ పావనమైనది. ఆతని గురుభక్తికి కళంకము లేదు. కాన నిస్సంకోచముగా నాతని కావిద్య నొసంగుఁడు. మిమ్ముతఁడు బ్రదికించి తీఱును. నా యంతరాత్మయు నట్లే ప్రోత్సహించుచున్నది" అని కచుని హృదయము చొచ్చి చూచినట్లు దేవయాని నుడివెను

దాని యుదారబుద్ధికి శుక్రుఁడు సంతసించి "పుత్రికా! సత్యము పలికితివి. ఈ పరీక్షయంతయు నాకుఁ దెలియక చేసినది గాదు. కచునిపై నీహృదయ మేరీతినుండునో అని తెలియుట కడిగితిని. ఆతఁడు పావనహృదయుఁడు. గురుభక్తిపరాయణుఁడు. పెక్కుసారులు రక్కసులచేఁ జంపఁబడినను, ఎన్నో బాములఁ బడుచున్నను మన గృహకృత్యములయం దేమఱక, మన సేనలయందు ప్రాలుమాలిక లేక మనలను శుశ్రూషించిన వాఁడు. కాన నాతనికీ పరిస్థితిలో నీవిద్య యొసఁగక తప్పదు" అని సంగతియంతయుఁ గచునకుఁ దెలియఁజెప్పి యాతనికి మృతసంజీవనీవిద్య నుపదేశించెను. అతఁడును బరమ భక్తితో నా విద్యను గ్రహించి యుదయాద్రిచాటున నుండి వెలువడు చంద్రునివలె గురువుల హృదయ కుహరము ను జీల్చుకొని వెలి కుఱికెను. వెంబడినే శుక్రుఁడు విగతజీవుఁడయ్యెను. అంతఁ గచుఁడా వేదమూర్తిని గాంచి మహామంత్రమును జపించి గురువును బ్రతికించి కొనెను. ఇట్లప్రయత్నముగా కచుఁడు శుక్రునివలన సంజీవనీవిద్యను బొంది కొంత

కాలము గురు గృహమునందుండి యొక్కనాఁడు గురువులతో సవినయముగ నిట్లని మనవిచేసెను.

"గురుదేవా! విద్యార్థినై వచ్చి తమయొద్ద సమస్త విద్యలను నేర్చితిని కొంచెముగనో గొప్పగనో తమ కరుణాకటాక్షము సంపాదించి కొంటిని నేనువచ్చి చిరకాల మైనది. ఇంక నాగృహముచేర నను జ్ఞనిండు. తమఋణము తీర్చికొన రానిది నన్ను కన్నవారికన్న మిన్నగా నాదరించి జ్ఞానగోష్ఠ మొసఁగిన తమ మహోపకృతికి బొందెలో బ్రాణ మున్నవఱకు కృతజ్ఞుఁడను. సదసద్వివేకము గలిగించి విజ్ఞానభిక్ష పెట్టి శిష్య జీవితములను తెలివి వెలుగులఁ బ్రకాశింపఁజేయు వారే పరమ గురువులు. అట్టి గురువుల మనసు వెన్నవలె తన సేవానిధిచే కరగించియు, తన ఋజుప్రవర్తనముచే వారిని మెప్పించినవాడే శిష్య పరమాణువు. ఈ రెండు కృత్యములందును మన ముభయులము ప్రమాదపడకుండ దాటఁగలిగితిమి. స్వామీ! నా విద్యాభ్యాస కాలమున జేయరాని చాపలములను తెలిసియైన తెలియకయైనఁ జేసియుండకపోను. వానినెల్ల మన్నించి నన్నాశీర్వదించి పంపుడు. నేనిఁక మాలోకము చేరుకొనవలె" నని మనవిచేసి దోసిలొగ్గి తలవంచి గురువుల యెట్టయెదుట నిలువంబడెను.

అట్లున్న కచుని వైఖరిఁ గాంచి దేవయాని గుండెలలో ఱాయిపడినట్లు కటకటపడుచుండెను. శుక్రుఁడును అంతేవాసి పలికిన సవినయభాషణములువిని మిగుల నానందించి "నాయనా!

చిరకాల సహవాసముచే నీపోక మాకు ఆకులపాటొదవించు టలో నబ్బురము లేదు. ఐనను ఎవరివా రెవరి కగుదురు ? మాకు కొమరుండు లేని లోటు తీర్చితివి. కాని తిరిగి యా లోటు రేపటినుండి మేము పొందవలెనుగాంబోలు. వత్సా ! చిరంజీవ! పోయిరమ్మా" అని యాశీర్వదించి పంపివేసెను.

ఈ సంభాషణమంతయు తూచాతప్పకుండ వినుచున్న దేవయాని నిమిషమైన నిలువంజాలక తన శయనగృహము చేరి బోరగిలంబడుండి కంటతడిపెట్టుకొనుచు "అక్కటా ! ఈ కచుని తలంచి నాహృదయమున నెన్నియో గాలిమేడలు కట్టుకొం టిని. నా ఆశాలతలు మొండుబాఱినవి. ఇన్నిదినములు మనసు లోని కోరిక మనసునందే మట్టుపెట్టియుంచితి. నేటితో నా యుద్దేశములన్నియు నడవికాంచిన వెన్నెలలైనవి. నీటవ్రాసిన యక్కరములైనవి. ఇప్పుడేమి చేయుదును. చేయికాలినవెనుక ఆకులతోం బనియేమి ? ఇంతకాలము సిగ్గు వెనుకను ఆశ ముందునకును నన్నుయ్యాలలూపినవి; ఊంపియూంపి నన్నిపు డొక నిరాశాకూపమున ముంచివేసినవి. ఇంక నా యీ యౌవన మెందులకు? నా యీ యలంకరణమెందులకు? నాకీ జీవితము వ్యర్థము. నాబ్రదుకు కచుండు లేనిచో చిమ్మచీకటి యేగదా!" అనుచు మిగుల విచారముతో నాగదిలో కుములు చుండం గచుండామె సెలవందుటకై గదిగుమ్మముకడకు వచ్చి యిట్లనెను.

"సోదరీ నేను మీ తండ్రిగారిని సేవింపవచ్చి చిరకాల మైనది. విద్యాపరిపూర్తియైనది. నేనింక మా తలిదండ్రుల కడకు పోవలసియున్నది. సెలవా?" అనియెను.

దేవయానియు శయ్యపైనుండి దిగ్గున లేచి నిలిచి కచునితో "ఓ కుమారా! నేనును నిన్నుదలచియే యాలోచించుచుంటిని. ఇన్నియేండ్లనుండి మనకుగల సంబంధ బంధము నేటితోఁ ద్రెంచి పోవుచుంటుట నీకు ధర్మమా! నిన్నుఁజూడక నేను నిముషము నిలువఁగలుగుదునా? వేయేల? నేటి వఱకు నాయూహ నీకు సూటిగాఁ జెప్పఁజాలకపోయితిని. నీపై నాకు వలపుగలదు. ఏమందువా? నీవు బ్రహ్మచారివి. నీతికోవిదుఁడవు సుందరుఁడవు. యువకుఁడవు. నేనును గన్యకను. యువతిని. మన యుభయుల వంశములును బంధుత్వమునకుఁ దగినవే చిరకాలమై మన యుభయులకును మానసిక వివాహమైనది. దానికి మదనుఁడే సూత్రధారి. కావున నన్ను నీవు పాణిగ్రహణము చేసికొమ్ము. చల్లకువచ్చి ముంతఁ దాచనేల? నా హృదయము నీ కెఱిఁగించితిని. సంజీవనీవిద్యతో పాటుగ నన్నును నీవు పరిగ్రహింపుము. దీనిచే మా తండ్రియు మహానంద మొందఁగలఁడు. నా కోరికయు నీరికలెత్తును. ఇఁక పాలముంచినను నీలముంచినను నీదే భారము" అని కొంచెపాటి సిగ్గుచే తలవంచికొని మెడలోని దండలను సవరించుకొనుచు నిలుచుండెను.

ఆ వాక్యములు విని వినుటతోడనె బృహస్పతి కుమారుఁడు మహావిషాదమంది రెండుచేతులఁ జెవులు మూసికొని "శివ శివా ! కలలోనైన నీవిట్లు భాషింతువని నేననుకొననైతిగదా దేవయానీ ! నీ హృదయమునకుఁదోఁచియే యిట్లంటివా ? లేక యెవ్వరినైన నడిగి పలికితివా ? ఇంత దనుక మనమిరువురము సోదరభావముతో మెలఁగుచుంటిమిగదా ? నా చూపులందుఁగాని నా కనులందుగాని, నా తలపులందుగాని, యెన్నఁడైన నీకీ భావము పొడసూపినదా ? లేక 'నావంటి సుందరి ప్రేమించుటయు, అది వ్యర్థమగుటయునా?' అని భావించి యీ వింత వింత భావముల వెలిబుచ్చితివా ? ఇది లోకనింద్యము కాదా ? పాపపంకమున పడబాలును, నగుబాలును నిందపాలును కావా ? నీవు నా కెట్టివావివరుసల దానవో రవంత విచారించితివా ? తమకమున గమకించి నోటికివచ్చినట్లు సోదరునితో సరసములాడఁదగునా ? గురుపులకు శిష్యులు పుత్రసములు. గురుపుత్రికలు ఛాత్రులకు సహోదరులు కావలదా ? అదియుఁగాక నీవు నీ మాతృగర్భమునుండి నీ జనకుల కెట్లు పుత్రికవైతివో నేనును కారణాంతరమున నీ తండ్రి కడుపునుండి పుట్టినవాఁడనుఁగానా ? తల్లికిఁ బుట్టిన నీవును తండ్రికిఁ బుట్టిన నేనును ఏమగుదుమో నీయంత దృష్టి నూహింపుము. నీమాట విన్నంతను, నీ యాకార వికారములు కన్నంతను నాగుండె లదరుచున్నవి ! సోదరీ ! నీకిట్టి పాపచింత గలుగుట నా దౌర్భాగ్యముగాక వేఱుగాదు. ఇంత

కాలము ఔననిపించుకొని గురుకృప వడసియున్న నాకు ఒక్క గడియలో మాటదక్కించుకొను యోగము లేదుకాఁబోలు! ఇది గురువులు విన్న నేమందురు? సహపాఠులు విన్న నేరీతి తలతురు? వద్దు వద్దమ్మా! అట్టిభావన విడిచి నాకు నాలోక ముచేర ననుజ్ఞయిమ్ము."

"ఆ! యేమనుచున్నావు? చిరకాలమునుంచి దాఁచి దాఁచి తప్పనిసరిగా వెలిబుచ్చిన నా యీ కోరిక మన్నింపక నిరాకరించుచుంటివా? ఇంతేనా మన తలఁపులు? ఓ సుకుమారా! మన వావివరుస లటుంచి నన్ను డేలికపఱుపక నా కోరిక చెల్లింపుము. నేను ధర్మములన్నియుఁ బరికించియే నిన్ను కోరుచుంటిని. కాముకులకు ధర్మములతో బనిలేదు. లోకోత్తర చరితుఁడైన కావ్యుని కొమరితను. నవయౌవన విలాసములచే నొప్పుదానను. నా జవ్వనమంతయు నిందాక నీకై మీఁదుకట్టియుంచితిని. నీచే గౌరవింపఁదగినదానను గాని యీసడింపఁదగిన యువతినిగాను. నీమాటలకుఁ బాటలకు, నీ మనోహర రూపసంపదకు నీవర్తనమునకు నామెనఁద లోలో నువ్విళ్ళూరి నేఁటికీమాట పలికితిని. దీనిని నీవు రిత్త పఱుప ధర్మమా? పలుమాఱు నిన్ను రక్కసులు హతమార్పగా నా తండ్రినిన్నై శము వేధించి బాధించి నిన్ను బ్రతికించు కొన్న దెందులకు? నీవు కుడిచిన వెనుక కుడిచి నీవు పరున్న తరువాత పరుండి, నీ సుఖమే నీ హాయియే నా సుఖముగ భావించిన దెందులకు? నిన్నెల్లవేళల నా మనోనేత్రములచే

నెట్టయెదుట నిలిపి నీ సౌందర్యదేవత నింతకాల మారాధించిన దెందులకు ? నీవంటి రసికుఁ డిట్లనవచ్చునా ? అదంతయును ప్రేమకే చేసితివి. సర్వవిధముల నామనమును జూఱగొన్న నిన్ను నేను వరించుట తప్పా ? ఏమి మాటాడకున్నావు ? మౌన మంగీకారసూచకమా కచా !"

"అమ్మా! నీవట్లు నన్ను బాధింపకుము. నానిర్ణయము తొలిసారిగా విన్నవించుకొంటిని. నీవు నాకై పలుపాట్లు పడిన మాట వాస్తవము. నన్నుకన్నవానికన్న మిన్నగఁ జూచి యాదరించి నాకింత విద్యచెప్పించినమాట నిజము. నన్నెన్నో యాపదలనుండి నీవు కాపాడినదియు సత్యము. వేయేల తల్లీ ! నీవు లేకున్న నేనెన్నడో చచ్చిపోయి యుండెడివాఁడను. అదియే నేను పలుసారులు నొక్కిచెప్పుమాట. నీవలన నేను బ్రతికితిని. నాజీవనదాతవు నీవు. నాతల్లివి. నీవు నాకు పుట్టుకనిచ్చితివి. అట్టి వాత్సల్యమే నాపై నీవు కనుపఱుపుము మీాసాలపై దె నెలవంటి యీా తుచ్ఛసుఖములేల ? ఇది దేవుఁడు మెచ్చు రీతిగాదు. నాకు నీపై కామములేదు. దానిని నీవు కలిగింపలేవు. గురుపుత్రివి. సోదరివి. నా మాతృదేవతవు. అమ్మా ! గురువులు విన్న నాకీర్తికి కళంకము నా వర్తనకు మచ్చ. నా పవిత్రతకు భంగపాటు. నా యంతఃకరణకు చుఱుక. నా దృష్టికి కాళరాత్రి. వలదు వలదు పెడదారిఁబెట్టక నన్ను నాలోకము నకుఁ బొమ్మని సెలవిమ్ము. ఇదే నా వాంఛితము. దీనిచే మన యిరువుర కీర్తియు స్వర్గమునకు మెట్లుకట్టును. మనమాచంద్ర

తారకముగ నాదర్శజీవనుల మగుదుము. దేవయానీ! నీయంద చందములకుఁ దగినవాని నొరు నెవనినైన వరించి నీవు సుఖపడుము." అని నుడువుచుండఁగనే కచుని చుఱచుఱ కోపముతోఁ జూచి దేవయాని గొంతుసవరించుకొనుచు "ఓరీ! ఎంత సిగ్గుపడుచితివి? అఁడుది తనంతతాను వలచి వచ్చిన ఫలము కాఁబోలు నిది! ఇంత కృతఘ్నుఁడవని యనుకొననైతిని. ఔరా! ఇంతవాఁడవని తెలియక నాగుట్టు బయటఁబెట్టితిని. హృదయ మిచ్చినందులకుఁ దగిన శాస్తి చేసితివి. పోనిమ్ము. ఇంతవఱకు చేయిదాఁటిపో లేదు లే. నీవు నా మనోరథము విఫలము కావించితివి. కొండంతయాసగొని నిన్ను బ్రేమించినందులకుఁ దగినఫల మనుభవించితిని. తగినట్లు బుద్ధిసెప్పితివి కానిమ్ము. నీకును నేనిపుడు కొంత బుద్ధిచెప్పవలసి యున్నది. నన్నవమానించిన ఫలమునకు బ్రాయశ్చిత్తముగా నీకు నా తండ్రి యనుగ్రహమున యలవడిన సంజీవని మహామంత్రము పనిసేయకుండుఁగాక! ఇదియే నీకు శాపము." అని కనలుచు కన్నుల నిప్పులురాలఁ బలికెను.

దానికిఁ గచుండును మిగుల బాధచెంది "అన్నన్నా! నన్నీ యువతి నిష్కారణముగ శపించినదే! కామాతురులకుఁ గన్నుమిన్ను తెలియదు. ఈమె నేనేగదా శుక్రునిపుత్రికనని మిగుల నెగిరిపడుచు నకల్మషుఁడనైన నన్ను దూఱాడినది.

ఇంక జంకిన లాభము లేదు. "దేవయానీ! ఏమా తొందరపాటు? గురుపుత్రికవని గౌరవించి మన్నించి మర్యాదచూపినందులకా మీఁదిమీఁదికివచ్చి శాపతాపములపాలఁబడఁ బోయితివి. చిర కాలము నాపడ్డ పాటు గొడ్డేటఁ గలుపుటకేనా నీప్రభావము! అవివేకినీ! కానిమ్ము. ఇంతకన్న నుజేమి చేయఁగలవు? నేను నిజముగా ధర్మపథము తప్పనివాఁడనేని, గురుభక్తిపరాయ ణుఁడనేని, పుణ్యహృదయుఁడనేని నీవచనంబుచే నాకు మృత సంజీవని పనిచేయనిచో నాచేత నుపదేశంబుగొన్నవారికిఁ బని సేయుఁగాక! ఇది తప్పనిసరి. నీవు ధర్మవిరోధముదలఁచి పర హృదయము తెలియక, పాపకార్యమునకుఁ సంకల్పించితివి. పోనీ తెలియనివారికిఁ దెలుపుట లోకపరిపాటిగదాయని, తెలి పితిని. ఐనను నీ యవినయము మానవైతివి. నిన్నింతతో విడు చుట ధర్మముగాదు. కావున నిన్ను బ్రాహ్మణేతరుఁడు వివా హముచేసికొనుగాక! ఇది నాప్రతిశాపము. పరిగ్రహింపు"మని గిరుక్కున నచ్చోటువాసి దేవలోకాభిముఖుఁడయ్యెను.

కచుఁడు స్వర్గము చేరుతోడనే దేవప్రముఖు లందఱును చుట్టుముట్టి యాతని విజయమునుగూర్చి ప్రశ్నవర్షము గురి యించిరి. అతఁడును వారినందఱను సభాముఖముగఁ జేరఁదీసి విద్యసంపాదించుటలోఁ బడ్డ పాటులనెల్ల విపులముగా విన్న వించి దేవతల రంజింపఁ జేసెను. పిమ్మట పలువు రాతనిమొద్ద

మంత్రోపదేశము విధివిధానముగా నంది, జపించి తత్ఫలముచే తమ సంఘము నుద్ధరించికొనుచుండిరి.

చూచితిరా! కచుని విద్యావ్యాసంగము!! తన సంఘమును, తన దేశమునుగూడ నుద్ధరించుటకై కచుఁడానాఁడు ముఖ్యపాత్ర వహించినాఁడు. సామాన్యపు విద్యయాయది! చచ్చినవారిని దిరిగి జీవింపఁజేయునట్టి మహావిద్య. ఈ యువకుఁడు దాని సాధింపఁ దలిదండ్రులవీడి ఇతరలోకము చేరినాఁడు. గురువుల నాశ్రయించినాఁడు. తన సేవావిధానముచే గురుపాదుల మెప్పించినాఁడు. అభ్యాసకాలమునఁ దనకు దాపురించిన కష్టపరంపరలనెల్ల దృఢమైన యోపికతో, సహింపఁగలిగినాఁడు. పరిపూర్ణమైన గురుకరుణ నందగలిగినాఁడు. దానిమూలమున మృత్యుభయమునుండిగూడ దాఁటఁగలిగినాఁడు. అంతటితో నాతని కష్టములు గట్టెక్కినవా? లేదు. ఆతనిపై రక్కసులకుఁ గోపము గలిగినది. తత్ఫలితము ననుభవించినాఁడు. ఏమైనను దన ముఖ్యోద్దేశమును సాధించునట్టి గట్టిపట్టుదల నుండి యాతఁడు చలింపలేదు. అణుమాత్రమైనను జంకలేదు. పైఁగా గురుపుత్రిక. యువతి. విలాసవతి. ఆతని ప్రేమించినది. ఆ అగ్నిపరీక్షలోఁ గచుఁడు పడినాఁడు. ఆతనిధైర్య మేమాత్రము చెడలేదు. పట్టుదలయు సడలలేదు. ఆమెకు తగిన నీతులుపదేశించినాఁడు. ఆమె ధర్మమార్గముతప్పి యాతని

శపించినది. శాపముచే దెబ్బ తిన్నాఁడు. ప్రతిభాశాలియగు వాతఁడు తన పురుషకారము చూపించినాఁడు. ప్రతిశాప మిచ్చినాఁడు. ఎట్లో యొకరీతి తన విద్య తన దేశోద్ధారకము గావలయునని ప్రతిశాపములోనే దాని మహిమను నిలుపు కొని గిరుక్కున వెనుదిరిగి నిజలోకము చేరినాఁడు.

ఉపాయముచే నెంతటి యపాయమైన దాటవచ్చును గదా! తన విధులను దాఁటక చరించుచు గురుభక్తికలవానికి సర్వకార్యములు కరతలామలకములని యీకథనుడువు చున్నది. కాన బాలకులారా మీరీ కమ్మని కథ జదివి, వాని ననుక రించుటకుఁ బ్రయత్నింపుడు.

# మణిమాల

## గుణనిధి :--

పూర్వము కాంపిల్యమను నొకనగరము సకలసంపదలతోఁ దులతూఁగుచుండెడిది. అందు సమస్తజాతులవారును కొంచెమో గొప్పయో కలవారేగాని కూటికిపేదలు లేరు. సంసారము గడువనివారును లేరు. లక్షాధికారులు దివ్యసౌధములందు నివసించుచు ధర్మనిరతులై యుండిరి. ఆ పురి నేలు రాజు ధర్మతత్పరుఁడు. ప్రజలను మిగుల రంజింపఁజేయుచు వారికిఁ గావలయు నుపకారము లొనర్చుచు వారి సౌహార్దమును మిక్కిలి సంపాదించుకొనెను. "రంజయతీతి రాజా" అను నర్థము నాతఁడు సార్థకపఱచుకొని చక్కగా పాలనచేయుచుండెను.

రాజు ధర్మతత్పరుఁడైనచోఁ బ్రజల కెట్టిలోటులును వాటిల్లవు. రా జధర్మపరాయణుఁడైనచోఁ బ్రజలకు క్షణక్షణ మపాయములు, బాధలు, కష్టనష్టములు గలుగుచుండును. ధర్మరక్షణమునకు రాజే పట్టుగొమ్మ. అట్టి రాజచంద్రుని పరిపాలనముచే నలరుచు నా నగరమందలి బ్రాహ్మణులు మిగుల సంతృప్తితో ధర్మకర్మములను నిర్వర్తించుకొనుచుండిరి. వారి వారి కెట్టిచింతయు లేక మిగిలిన జాతులవారికిఁ బ్రీతిపాత్రులై యుండిరి.

అందు యజ్ఞదత్తుఁడను నొక బాపఁడు గలఁడు. ఆతఁడా యూరికిఁ గులపెద్ద. వేదవేదాంగములను ధర్మశాస్త్రములను క్షుణ్ణముగా దెలిసినవాఁడు. ఎన్నోజన్నముల నాచరించి రవంతయేని స్వధర్మము విడనాడక చుక్కలలోఁ జంద్రునివలె నా నగరమున కాతఁ డలంకారప్రాయుఁడుగ నుండెను. మఱియు నాతఁ డా గ్రామమందు నిత్యము ధర్మశాలలలోఁ బురాణకాలక్షేపమొనర్చుచుఁ బెద్దపెద్దల గౌరవమును వలసినంత సంపాదించెను. ఇంకను ఆతఁడు రాజపురోహితుఁడై వారి మన్ననలను దక్కుచుగ నందుచుండెను ఎట్టివారికైనను రాజావలంబన మున్నచో నాకీస దాటగాఁ బాడి నది పాటగాఁ జెల్లుచుండునా! బంగరు పళ్లెరమునకైనను గోడచేరుపు వలయుననుగదా! అప్పుడుగాని యది శోభిల్లదు. ఇట్లు కాంపిల్యపురమునం దా యజ్ఞదత్తుని మాటయన్న శిలాశాసనమై యొప్పుచుండెను. దానికిఁదో డాతని దైవభక్తియు, తపస్సు, శౌచము, ఆర్జవము మున్నగు సహజధర్మములు గొప్పయాడఁదగియుండెను. బంగరమునకుఁ దావి గలిగినట్లు మెఱుఁగులలో నాతఁడొక గౌరవకుటుంబియై పెద్దల గౌరవము విలువుచుఁ గాలము వెడలఁబుచ్చుచుండెను.

అతని పద్ధతులకు అనుకూలవతియై పతిభక్తిపరాయణయై యాతని భార్య యన్నపూర్ణమ్మ యనఁదగియుండెను. ఎంద అతిథులు వచ్చినను ఆమె రవంత విసువులేక వండి పెట్టుచుండెడిది. అనుకూలవతియగు భార్య కలిగినప్పుడే పతికి

సౌఖ్యగౌరవములు గలుగును. బండిచక్రములు రెండును బాగుగ నున్నప్పుడే యా శకటము సరిగా దొరలును. అందే చక్రము పాడైనను బండి సరిగా నడువదు. అట్లే యాదంపతు లిరువురును దమ సంసారమును జక్కగ నడుపుకొనుచు సుఖముగా నుండిరి. వారట్లుండఁ గొంత కాలమున కాదంపతులకు సంతతి లేని విచార మధికమయ్యెను. కాలము చాలవఱకు గడచెను. వారు సంతానమునకై యెన్నియో పాట్లుపడిరి వ్రతములు ఉపవాసములు, దానములు, ధర్మములు పుష్కలముగఁ జేసిరి. ఎన్నియో క్రియలొనర్చిరి. ఎవ్వరేది చెప్పిన నద్దాని నేపుట్టలో నేపామున్నదో యని యనుకొనుచు మిగుల శ్రద్ధావంతులై చేయుచుండిరి తుదకు ఏదేవుని యనుగ్రహముననో వారికొక పుత్త్రుఁడు జన్మించెను. వారాతని మిగుల వాత్సల్యముతోఁ బెంచుకొనుచుండిరి. క్రమముగా నాతఁడు శుక్లపక్ష శశివలె ప్రవర్ధమానుఁడగుచు నేఁడెనిమిది వత్సరముల యీడు నందెను. అప్పటి కాతఁడు పరులకుఁజూడ మనసుపుట్టించుచుండెను. వయసుతో పాటాతని యందచందములును బెఱుఁగుచుండెను. గుణనిధి యను పేరాతని యాకారము చూచిన వారెల్లఁ దగిన పేరని మెచ్చుచుండిరి. సువర్ణచ్ఛాయను మించు దేహకాంతి, చేరలంతంత కన్నులు, వంగి పొడవైన ముక్కు, మసృణములైన యంగములు గలిగి యొప్పారుచుండెను. ఎన్నిసారు లాతని రూపముగాంచినను జనులకుఁ దృప్తితీఱదు.

ఎనిమిదవయేఁడు వచ్చినతోడనే గుణనిధికి తలిదండ్రు లుపనయనము కావించిరి. పిమ్మట మంచి గురువులయొద్ద నాతని జదువవేసిరి. ఆ వేళావిశేష మెట్టిదియోకాని యాతని కెన్ని వత్సరములకైనను రవంతయేని విద్య యంటలేదు. లేక లేక గలిగినవాఁడగుటచేఁ దలిదండ్రు లాతని విద్యాభ్యాస విషయమున జాలుముడిగా నుండిరి. కన్నవారికి లేనపుడు పైవారికి మాత్ర మేమిశ్రద్ధ గలుగును? గురువులు తగు శ్రద్ధ దీసికొన్నను తలిదండ్రుల పరామర్శ లేనిచో బాలురు బాగు పడుట దుర్ఘటము. విద్యార్థులు గురువులసన్నిధి గడపునది కొంచెపాటికాలమే. జననీజనకులకడ గడపునది యెక్కువ కాలము. కాన బాలకుల బాగోగులను గుఱించి తగిన శ్రద్ధ జనకులే తీసికొనవలసి యున్నదిగదా. లేనినాఁడు వారు రెంటి కిని జెడిన రేవడలగుదురు. అగుటయేగాక, వారు దురభ్యాసము లకు లోనై, దుర్వృత్తు లొనర్చుచు భ్రష్టులగుటయునై కన్న వారల కపకీర్తి తేఁగలరు. అట్టివారివలన వంశముల కెల్ల చేటు వాటిల్లును. వంశమును దామును నిందలపాలు కాకుండుటకై బిడ్డలయెడ శ్రద్ధ పూనవలసిన బాధ్యత తలిదండ్రులు పూనవలసి యున్నది.

అట్లు గుణనిధి చదువుపై దృష్టిలేనివాఁడై దుస్సాంగ త్యములు చేయుచు, దురభ్యాసముల కలవడెను. అట్టియల వాటులవలన నాతనికి ధన మావశ్యకమయ్యెను. అందులకై యాతఁడు జూదముగూడ నేర్చెను. ఆ యాటయందు నేర్పుగల

వారితో స్నేహము పాటించి అందలి గుట్టుమట్టులన్నియు గ్రహిం చెను. దురభ్యాసములలో ద్యూతము మిగుల గొప్పవ్యసనము. అందుఁ బ్రవర్తించినవారికి వేళపాళలు, ఆఁకలిదప్పులు, అవస రానవసరములు తెలియవు. అట్లే యీతఁడును దన కులాచార ములను బూర్తిగా విడిచి సర్వవేళలందును నయ్యాటయందే దగుల్కొని యుండెను. దానివలన నొకొకప్పుడు వచ్చెడి ధనముచేఁ దన యవసరములు గడపుకొనుచు, ధూమపానము, పేకాటలు మున్నగునవి లేనిదే నిముసము నిలువలేకుండెను.

ఇట్లు తన దృష్టియంతయు దురభ్యాసములపైఁ గేంద్రీక రింప గుణనిధి క్రమముగా బ్రాహ్మణాచారములన్న వేళా కోళము చేయుచు, అగ్నిహోత్రముల నర్చించుట కసహ్యపడు చుండెను. ఏవో పాటలనియు, ఆటలనియు, వాద్యములనియు, వారకాంతా నృత్యములనియుఁ నెపములు పెట్టుకొని యింటిని విడిచిపోయి వేళపట్టుల సంధ్యావందనములనుగూడ నిప్పచ్చర మొనర్చెను. జమ్మికాంద్రు, జూదరులు సహచరులగుటచే నాతడు దేవుఁడులేఁడు, దయ్యములేదను వాదములోనికి దిగి దేవనిందలుగూడ సర్వదా చేయుచుండెను. అట్లు నాస్తికులతో బరిచయము చేయనేర్చి తనకున్న ధనాశకారణముగా నెవ్వ రైన బంగారము తయారొనర్తుమన్నచో తెలకపిండికి రుచి పడిన కుక్కవలె వారియిల్లు విడువక తిరుగుచుండెను. మెల్లగాఁ గొన్ని నాటకములలోఁ జిన్నచిన్న వేషములు పూని నటించు టయు, ఎట్టిసీచులనైనఁ దనయింటికి రప్పించి వారలకు లేనిపోని

గౌరవము లొసఁగుటయు వారలతో జూదపుటిండ్లకుఁ బోయి హాయిగా నాడుటయు, వారిని ప్రోత్సహించుటయుఁ జేయు చుండెను. కాని యాతనికిఁ జేయునిందుకు ధనము చిక్కుట లేదు. అందులకై యతఁడు నమ్మికగలవానివలె యిల్లుచేరుచుఁ దల్లి వస్తువులను లంకించికొనిపోవుచు, అవసరమునుబట్టి వానిని దెగనమ్మియో, తాఁకట్టులువెట్టియో యవసరమగు విత్తమును జిక్కించుకొనుచుండెను. ఇట్లు క్రమముగా నాతఁడు చౌర్యవిద్యయందుఁగూడ నేర్పుగడించి మాతృదేవత యొడలి భూషణము లెవ్వుడువిలువడిన నప్పుడు తస్కరించి యెవమట్టున కమ్ముచు నవసరములను దీర్చుకొనుచుండెను.

క్రమముగాఁ బుత్రుని దురభ్యాసతత్పరతను దల్లి గ్రహించెను. కాని యేమనఁగలదు? ఒక్కగా నొక్క కుఱ్ఱఁడు. లేక లేక తమ వార్ధకదశలోఁ గలిగినాఁడు. తను కంటితో యింటితోఁ గొంత దేవుఁడిచ్చినాఁడుగదా! బిడ్డని సంతోషముకన్న మన కేమికావలెను? అని యామె చాలకాలమువఱకు, అతఁడిల్లు చేరుచు, తన కన్నులకుఁ గనిపించుచున్న చాలును. ఏది ఏమైనను సరే, అని యూరకుండెడిది. కాని తొండ ముదిరి యూసర వెల్లియైన దన్నటుల పుత్రుని బుద్ధులు, చేఁతలు దినదినప్రవర్ధమానములై యిల్లు గుల్లచేయుచుండ, పాపమా యిల్లాలు మిన్నక యెట్లుండును? అంత నామెకు లోలోన విచార మంకురించెను. ఒకనాఁడు అర్ధరాత్రమున కొమరుడిల్లుచేరఁగా నామె యాతనిగారవించుచు "నాయనా! నీవిట్లు రాత్రియనక

యపరాత్రియనక దుస్సాంగత్యముతోఁ దిరిగి తిరిగి వచ్చుట బాగున్నది కాదు. నీపద్ధతి నాన్నగారు వినిరేని చాల బాధ పడెదరు; మన తాతలతరమునుండి నీతరమువరకు విశుద్ధతర మైన మన వంశము దలపవైతివి. ముసలివారమగు మమ్ముల నరసి మాకష్టసుఖములఁ గనిపెట్టి మాకుఁ దోడుపడకుంటివి. ఇంటిలోని వస్తువులనెల్లఁ గొల్లగొనినచో మా తరువాత నీ సంసారము నడచుట యెట్లో విచారింపవైతివి. మహారాజుచే గౌరవింపఁబడుచు, యజ్ఞయాగము లొనర్చి, సత్యనిరతులై, వినిర్మలాచారపరులైన నీ పితృదేవులఁ దలపకుంటివి. నీవిట్లు తప్పనడతలు నడచుచు, దుష్టస్నేహములొనర్చుచు నున్నచో మా మనసులు పరితపింపవా ? తండ్రీ, నీవింక నీపద్ధతి మాన వలెను. మంచివారల జతఁగూడి మంచిపనులు చేయవలెగాని మావంటివారల గర్భమందుబుట్టి యిట్టివా, చేయవలసిన కృత్యములు? నాయనా ! నీక్షేమముకోరి చెప్పుచున్నదానను. ఈ పైని నీపవ్రిర్తనము మార్చుకొను"మని బోధించుచుండెడిది.

తండ్రియు రాజ పౌరోహిత్యమగుటచే సర్వదా రాజ కార్యములను దీర్చుకొనుచు, తన సంపాదనమేమో, తన యగ్ని హోత్రములేమో, తన నిత్యకృత్యములేమో, వానిపైనే తన దృష్టినుంచి మసలుచుండెనుగాని కొడుకును బరామర్శించుటకుఁ దగిన యవకాశము లేకయుండెను. ఒకొక్కప్పుడు యజ్ఞదత్తుఁడు "ఔనే ! కుఱ్ఱవాఁడు కనుపింపఁడేమి ? ఎక్కడ నున్నాఁడు ? ఏమిచేయుచున్నాఁడు. విద్యాలయమునకుఁ బోవు

చున్నాఁడా ?" అని ప్రశ్నింపఁగా "ఇంతవఱకిక్కడనే యుండెనండీ! ఇప్పుడే స్నానమాడి సంధ్యవార్చి, దేవునికి నమస్కరించి, చద్దిగుడిచి, బడికిఁ బోలు వెడలినాఁడు. వాని చదువు, వానిగొడవయు వానిది. మీకు కోడలువచ్చువఱకు వాని కింటిబాధ్యత యేమున్నది? బాల్యమో భాగ్యమో అన్నటులు వానికీ చిన్నతనమే వన్నెతనము. ఇంక మూఁడు ముళ్ళు పడినవెనుక సంసారలంపటముతప్ప స్వేచ్ఛయెక్కడ?" అని యేవేవో తెలుపుచు గృహపతిని సంతోషపెట్టెడిది. కాని నాఁనాఁటికి కొమరుని చిలిపిపనులుకొన్ని సోమయాజికిఁ దెలియఁ జొచ్చెను. ఇంటియందలి యమూల్యవుసరకులు కొన్ని యాతనికిఁ గానరాకుండెను. వానినిగూర్చి పదిపదిసారులు తనభార్య నడుగగా నామె సమయమునకు సరిపడునట్లు సమాధానము లిచ్చుచు సోమయాజిని ప్రసంగాంతరములలోని కీడ్చివేసెడిది.

గొడ్డుపోఁగికన్న బిడ్డగావునను ఒక్కడేయగుటచేతను, ధూర్తుఁడగువాని దుశ్చేష్టితములను యజమానికిఁ దెలియనీకుండఁ జేయుచుఁ దల్లి యెప్పటి కప్పుడణఁచివేయుచుండెను. సోమయాజియుఁ దన భార్యపైనున్న గౌరవముచే వానిని నమ్మి మిన్నకుండెను.

తానొనర్చు దుండగములను తల్లి యిట్లు జనకునికిఁ దెలికుండఁ గప్పిపుచ్చుటయు, కావలసినపుడు కాసుపైసములు తన చేతికిఁ జాటుమాటుగ నొసంగుటయుఁ గారణముగా గుణనిధి మఱెంత నీతినియమములు లేనివాఁడై యిచ్ఛవచ్చినరీతిని

సంచరించుచుండెను. క్రమముగా నాతఁడు మద్యపానమొన ర్చువాఁడై వేశ్యల సేవించువాఁడై, దొంగతనము దురాచారము, పరదారాభిలాషయు నినుమిక్కిలి కాఁగా సర్వవిధముల పాడై దేశద్రిమ్మరివలె తిరుగుచుండెను. నవయావనమందిట్టి దుర్బుద్ధులు గలిగెనేని వీని వారింప నెవరికి శక్యమగును? గురువుల వాక్యములు మిగుల నిర్మలములైనను, చెవియందుఁ బడిన నీళ్ళవలె దుష్టునికి బాధనే కలిగించుచుండును. అయినను దీనికి తల్లి కడుపెట్లు సహించియుండును? తన బిడ్డను గుఱించి యూరిలో పలువురు పలురీతుల భాషించుచుండిరి. అవన్నియు నానోట నానోట సోమిదేవికి వినుపించుచుండెను. ఈసందర్భములు సోమయాజికిఁ దెలిసినచోఁ దన్ను తన పుత్రునిగూడ నేమనునోయని యామె బెదరుచున్నను మఱియొకతూరి బిడ్డకు బోధింపవలెనని యామె యొకసమయమున నాతని కిట్లనెను.

"నాయనా! మనపట్టణమందలి దుండగీడులతోఁ గలసి యన్నివీథులందును వెఱ్ఱివానివలె తిరుగుచుండ నా కడుపు చుమ్మలుచుట్టుకొని పోవుచున్నది. చెరువులో నీటియందలము కొనిన నాచువలె నీదుండగములు పురజనులకెల్లఁ దెలియవచ్చుచున్నవి. రాజీసంగతి తెలిసికొనెనేని నీ తండ్రిని చులకనచేసి తన పౌరోహిత్యము మానిపించును. మన జీవనాధారమున కిచ్చిన వృత్తులను లాగుకొనును. నీమూలమున మాకు లేని ముప్పులు వాటిల్లును. తుదకు మాకు కూడుగుడ్డలకు కఱవు

వచ్చును. ఒడలెరుంగక నీ వీ యూరిలో చేయుచున్న కొయ్య
తనములుచూచి, నిన్ను నన్ను మీతండ్రిని కాంచి జనులు నవ్వె
దరు. లోకమందు బిడ్డలు లేనంతమాత్రమున నాఁడుది గొడ్రాలు
కాదు. దౌర్భాగ్యుఁడగు పుత్రుని కన్న తల్లియే నిజమైన
గొడ్రాలు. ఇట్టి కాంతవలన, నీమె సంతతివలన సంఘమునకు,
దేశమునకు క్షామముకలుగును. కాన నిన్నుగూర్చి జనులెల్లరు
నన్నె తిట్టెదరు. లోకులు కాకులుకదా ! వారికి సత్యా
సత్యములతో నిమిత్తము లేదు. నోటికివచ్చినట్లు వచింపగల
సమర్థులు. నీదుర్ణయమంతయు నామీఁదపెట్టి దబ్బరలు పలుకు
వారి నెవరడ్డగింతురు ? నాయనా ! అపకీర్తికి, లోకులకు,
పాపములకు వెఱువవలయును. మంచివాఁడనిపించుకొనుటే
మనుజునకు జన్మఫలము. కాన నీ నవయౌవనమును, అవినయ
మున కాలపట్టుకానీక, నీవు వ్యసనములందుదిగక, యీ దుండ
గములను మానుము." అని యనేకవిధముల తన హృదయము
లోని బాధలను వెలిబుచ్చుచు బిడ్డను మందలించెను. కాని,
వానిని విని యాతఁడేమియు ననక అప్పటి కూరకుండెను. తన
దుర్వర్తనము మాత్రము యథాపూర్వకముగా నడిపించు
చుండెను.

సోమయాజి కార్యార్థమై యొకనాడు గ్రామములోనికి
పోవుచుండెను. అప్పుడాతని రత్నాంగుళీయకము నొకజూదరి
వ్రేల గాంచెను. వెంబడినే "అక్కటా ! మనకు పుణ్యకాల
మందు మహారాజు ధారాపూర్వకముగానిచ్చిన అంగుళీయము

కాదా యిది? నేను మనసార ప్రేమించిన సోమిదమ్మకు దాచ మని యిచ్చిన యుంగరముకాదా యిది ? దీని వ్రేలధరించి కాదే యజ్ఞములు గాదు లొనరించితిని అట్టి పుణ్యప్రదమైన యంగుళీయక మీ జూదరి చేతనుండుటను కారణమేమొ' ఇది తప్పక నాయదియే. ఏన నడిగెదనుగాక" అని యాతని సమీపించి చేయిపట్టుకొని స్పష్టముగా దానినిచూచి "ఓర్యా! ఈ యుంగరము నీకెట్లువచ్చినది? నిజముచెప్పుము. నీవసత్యమాడితివా రాజుకడకు నిన్నుగొంపోయి సత్యము పలికించి దండించెదను." అని గద్దింప, నా జూదరియును నీళ్ళు నములుచు "అయ్యా ! అబద్ధమాడ నాకేల ? సత్యమే పలికెదను; వినుండు. వినుండు. గుణనిధియనువాడు మీతనయుడేకదా ! ఆతడు తప్పద్రాగి నాతో జూదమాడి నెత్తమునందోడిన విత్తమునకై మీయంగుళీయకము నాకిచ్చెను. ఇదియే కాదు, బంగారు భృంగారములు, కర్పూరీకలాచికలు, తళియలు పళ్ళెరంబులు, తామ్రపాత్రలారకూటఘటంబులు, ఎన్నెన్నియో యాతడింటనుండి తస్కరించి తెచ్చి తాకట్టువెట్టినాడు. ఆతనివ్యసన మింతింతనరాదు. ఒక్క నెలలో మమ్ములనెల్ల మించినయాటగాడయ్యెను. చేత డబ్బులేక మేమెవ్వరమైన వెనుదీసినచో మమ్మాతడు ప్రోత్సహించి జూదమాడువఱకు మమ్ము బ్రతుకనీయడు. జూదగాండ్రలో నంతవాడులేడు, సోమయాజులలో నీయంతవాడులేడు. మీయుభయులకును సరిపోయినదయ్యా ! అని యాతడు పకపక నవ్వెను.

ఆమాటలు యజ్ఞదత్తుఁడు విని సిగ్గును గోపమును మనమున ముప్పిరిగొనగా నున్నగా రేగుపండునలె గీయించిన తన బోడిబుఱ్ఱకుఁ బచ్చంచుల యంగవస్త్రము చుట్టబెట్టుచు మాఱుపలుకలేక తలనెత్తలేక, యింటికేఁతెంచి యరుగుపై కూలబడిపోయెను. ఆతనికేమియు పాలుపోలేదు. కడుపులో చేయిపెట్టి కలచినట్లయ్యెను. అప్రియత్నముగా నాతనిదృష్టి మాఱిపోయెను. నిమిష నిమిషమునకును తలవంకించుచు దనలోఁ దానేదియో గొణఁగికొనుచుండెను. అంత సోమిదమ్మ పతిరాకట నెఱిగి కాళ్ళు కడుగుకొనుటకు జెంబుతో చన్నీటినిదెచ్చి ముందుంచెను. భార్యను గాంచుతోడనే యాతని కోపముప్పొంగి పొరలిపోయెను. "జానే, నీళ్ళకేమిగాని సోమిదమ్మా ! ఏమిచేయుచున్నావు ? ఇటురమ్ము. అక్కడ లోగుమ్మమున గూరుచుండుము. నీ కొడుకెక్కడికి పోయి నాఁడే ? పోనిమ్ము. అప్రశ్న నాకేల? ఏయర్థరాత్రమునకో వాఁడే రాఁగలఁడు. దినదినము క్షణక్షణము నాకు వానిని గూర్చి నీతో వాదులేల ? మధ్యాహ్న సమయమగుచున్నది. సంధ్యవార్చి యగ్నికార్యము చేసికొనవలసియున్నది. నిన్న నీవు నాకు తలంటి నీరుపోయునపుడు నలుగుపిండితో మెఱుగుతగ్గు నని నావ్రేలియుంగరము తీసి దాఁచితివికదా ! అద్దాని నిటు తెమ్ము. అదిలేనిచో నాకర్మకలాపముదీర్ప వీలులేదు. వట్టి చేతితో నగ్నికి హవిర్దానము చేయరాదు." అని యనెను.

అంత నామె సంగతి నొక్క త్రుటిలో గనుపెట్టి తన పతితో నిట్లనెను. "నాథా ! సంధ్యాకాలమైనది. ఇవిగో నీళ్ళు, పాదప్రక్షాళనమొనర్చి సంధ్యవార్చుడు. అగ్నికార్యము తీర్చికొనుడు. పిమ్మట దేవతార్చనము చేయుడు. పంచయజ్ఞములను జేయుడు. మన మొగసాలియందు బ్రాహ్మణోత్తములు భోజనమునకై యతిథులుగా వచ్చియున్నారు. రెండుజాములు తిరిగినది. వంటయై జామైనది. పక్వాన్నములు శాకపాకములు చల్లనారిపోయినచో రుచిపోవును. మీరు చురుకుగా తెమల్చవలెను. నేనిప్పుడు మడిగట్టుకొనియున్నాను. మీ యుంగరమును మన పడకగదిలోని యినుపపెట్టెలోని బరిణెలో దాచి భద్రముగా నుంచితిని. ఇప్పుడు దానికై వెదుక వీలులేదు. భోజనమైనవెనుక యిచ్చెదను." అని పలికెను.

దానికి సోమయాజి మిగుల కోపించి మొగము జేవురింప మిగుల తత్తరమందుచు "ఓసీ ! ఎన్ని దబ్బరలాడుచున్నావే ! ఒకమూల మోడ మునిగిపోవుచుండ కొయ్యబట్టి వ్రేలుదురటే. ఇంకను నీ యసత్య సంభాషణము మానవైతివి. నీవు సాధ్వివి. పతివ్రతజనయిత్రివి. సూనృతవాదినివి." అని నేను తలచితిని. ఉల్లి వాసన దాచిన దాగునదా ? మొగలి పరిమళము మూతవేసినచో నణగిపోవునా ? ఏమా పుత్రవాత్సల్యము ? ఇంకను దాచెదవేలనే ? సిగ్గు సిగ్గు. కొడుకు ఎంత చెడవలెనో యంతయు జెడినాడు. చెడినాడన నేల? నీవు వాని భ్రష్టునొనర్చితివి. కుఱ్ఱడు పాడగుచుండ వానిని తగురీతి

మందలింపక పిల్లికవ్వలవలె కప్పిపెట్టుట యింతవఱకుఁ దెచ్చి
నది. విన్ననవేల ? నా అశ్రద్ధయే దీనికి ముఖ్యకారణము.
పోనిమ్ము. నీవుంటివిగదా ! సంతానబాధ్యత యిరువురకును
సమమేగదా ! అందును తల్లిప్రాణము. నీకన్న నేను ముఖ్యుఁ
డనా ? అని యూరకుండినందులకుఁ గొంపముంచితివి. నాకు
దెలియదనుకొంటివా ? స్వాధ్యాయము చదువక పిల్లవాఁడు
చవటయై తిరుగుచుండ చదువుచున్నాడని బొంకుట నీకు
ధర్మమేనా ? ప్రాతస్స్నానము బిడ్డచేసెనా ? అని నేనడుగగా
ఆ ఐనదని చెప్పుట న్యాయమా ? సంధ్యావందనము, అగ్ని
కార్యము మున్నగునవి చేయనిదే చేయుచున్నాఁడనుట భావ్య
మా ? ఓసీ ! నీనిలువెల్ల కల్లయే. ఏముఫలమున్నదని యిట్టి
యసంబద్ధములాడితివి ? నేను నీ మాటలనమ్మి వానిని పరిశీ
లించికొనక చెడ్డయింటి చెడారమైతిని. చెప్పుటకేమున్నది ?

నామేడగదిలోని తమ్ములపు పసిడిపడిగె మెక్కడికి
పోయిదోకదా ! నాబంగారు భృంగారువు ఏకోమటింట
తాకట్టుబడియున్నదో? నీబంగరు గజ్జెలయొడ్డాణమే యెగురుఁ
బోడి తాల్చుచున్నదో? ఎంతో వెలపెట్టి ముచ్చటతో కొన్న
నీ పెద్దపట్టుఁజీర లే వలపుల వనితల కలంకారమైనవో? అన్న
న్నా కష్టపడి చెమటలూడ్చి సంపాదించిన నాయార్జనమంతయు
నీవును నీ యొంటికొడుకును గలిసి గంగపాలొనర్చితిరి. ఓసి
నిర్భాగ్యురాలా! నాకొంప త్రవ్వివేసితివి. చాలు చాలు నాకా
నిర్భాగ్యపుత్రుఁడు లేఁడనుకొనెదను. వాఁడు చచ్చినాఁడు.

ఇదే వానికి దిలతర్పణము లిచ్చెదను. ఇట్టి కుపుత్రుని గనుట కంటె అపుత్రత్వమే మిగుల మంచిది. కులము చెఱచునట్టి యీ నీచుని పరిత్యజించి కులమర్యాదలు రక్షించుకొనుట మేలుగదా!" అని పలికి తటాలున లేచి లోనికేఁగి స్నానాద్యనుష్ఠానము లాచరించి తన యాగ్రహము కృతార్థత్వమందునట్లుగాఁ బుత్రునితో పాటుగఁ దన ధర్మపత్నినిగూడ నిల్లు వెడలఁగొట్టి నిశ్చింతముగా నుండెను.

అంతకుముందే గుణనిధి తండ్రి కోపమును దెలిసి యింటి కడఁ దన్నుఁగూర్చి తన తల్లిని విడుచుటయు మున్నగు విషయముల నెఱిఁగి యిల్లుత్రొక్కినచోఁ దనమర్యాద దక్కదనుకొని యీ గ్రామము విడిచి పోవుచుండెను. అప్పుడాతని హృదయము ఇట్లు పరితపించెను.

"అయ్యో! నేనిప్పు డేమిచేయుదును. ఎక్కడికిపోదును. చేతిలోఁ జిల్లిగవ్వయైనలేదు. చదువు మొదలే యంటలేదు. ఇంతవఱకుఁ బదుగురకుఁబెట్టిన నాచేయి నేఁడొకరి చేతిక్రింద దగుట కెట్లు సహింతును? నిజముగా సర్వోత్తమసలిపి, ఎట్టి భయమునుబొందక, చోరబాధాదులులేక యిచ్చినకొలఁది పెఱుఁగునట్టి విద్యాధనమే ధనము. కటకటా! నేను పుట్టిన సద్వంశమెట్టిది! నా వ్యసనము లెట్టివి! ఎంత నీచతకుఁ బాల్పడితిని! ఇప్పు డుభయభ్రష్టుఁడనై పనికిమాలిన పొట్టకూటికై బాధపడవలసివచ్చినది. నన్నుగూర్చి మాయమ్మ యెన్ని యిక్కటులు పడుచున్నదో! నిజముగాఁ దల్లివంటి

పదార్థము వేఱొకటి లేదుగదా ! పొద్దుపొడువకుండఁగనే వేన్నీళ్ల స్నానముచేయించి చక్కఁగా దువ్వి, బొట్టుపెట్టి వెండి గిన్నెలో నావుపెరుగుపోసి కలిపినయన్నము కడుపాఱఁ దినఁ బెట్టెడిది. ఆమె కరుణావాత్సల్యము లపారములు. ఇంక నా కడుపాఁకలి తెలిసి కనుగలిగినట్లు భోజనము పెట్టువా రెవ్వరు గలరు ? నాకోరికలు తీర్చువా రెవరు ? నా జన్మము వ్యర్థము. నేను చెడఁబుట్టితిని.

అంత సూర్యాస్తమయ సమయమయ్యెను. కుంకుమపు చాయతో, చివురుల చిరుశోభతో, చిలుకముక్కుల చెలువుతో స్నేహముచేయుచు, ఆకసమునం దాదిత్య కాంతులు పింగళభావమొందుచుండెను. అప్పుడు దివాకరుఁ డెఱ్ఱని జడలు ధరించిన భార్గవునిరీతి ప్రకాశించుచుండెను. పడమటవైపు నున్న యాకాశ భాగములందు శమంతపంచకమునందలి రక్త నదులవలె సప్తాశ్వుని యరుణకాంతి మడుగుకట్టి నట్టుండెను. నీరెండలువ్యాపించుటచే దివసభాగము పలుచబాఱెను. అస్తగిరి శిఖరముపైనున్న హరిదశ్వుని బింబము, కొంచెముగా వికసించిన నిచులకుసుమముల గుత్తివలె ప్రకాశించుచుండెను. మఱియుఁ బడమటి కొండవాల రంగుతోఁ గూడిన ప్రవాహము వలె సంధ్యారాగము గగనమను చక్రము నాక్రమించెను. నాలుగు వీథుల మొగలనున్న మహావృక్షములు పక్షుల సంకులధ్వనితోఁ గూడి కలకలలాడు కులాయములతో నందముగా నుండెను. ఈశ్వరుని కంఠమూలమందలి నలుపువంటి చిమ్మ

చీకట్లు బ్రహ్మాండ మండలమును గప్పివై చెను. రాత్రియను శుక్తియందలి ముత్తెములరీతి చుక్కలు మిణుకు మిణుకుమనుచుఁ బొడిచెను. రేపు రాఁబోవు మిహిరాంశుని కిరణములకివి బీజములో యనునట్లు గృహదీపములు ప్రకాశించుచుండెను.

ఆ చీఁకటిలో ఱాయిఱప్పలనక, మిట్టపల్లములనక, ములుముల్లలనక దారిబట్టి యదేపనిగాఁ గంటఁ దడినిడుచు గుణనిధి నడచి నడచి కొంతరాత్రికొక పల్లెటూరు చేరుకొనెను. అసలాఁకలిచే తూలిపోవు నాతఁడు నడచుటవలన గలిగిన బడలికచే మఱింత తేగతొక్కవలె వ్రేలబడిపోయెను. ఇంక నడుగుతీసి యడుగిడుట కాతనికి రవంతయైన నోపిక లేకుండెను. అట్లాతఁడెట్లో శ్రమపడి వీధులు తిరుగుచుండ నొకచోనొక పెండ్లివారి ఇల్లు కానఁబడెను. అతఁడా యింటిముంగిలి పందిరిరాటకు జేరఁబడి చూచుచుండఁగా కమ్మని భక్ష్యముల సువాసన లాయింటనుండి గాలికి వెలువడెను. వాని నాఘ్రాణించుతోడనే యాతని కాఁకలి యధికమయ్యెను. జనులు వీధి యరుగులందును లోపలనుగూడ అడ్డదిగటముగా విచ్చవచ్చినరీతి పరుండి గాఢనిద్రలో మునిఁగియుండిరి. ఇఁక నాతని యాఁకలికి పట్టపగ్గములు లేకుండెను. తోడనే "ఈ గృహము చొచ్చినచోఁ గమ్మని పిండివంటలతోడ భుక్తికడుపాఱ దొరకితీఱును. ఈ ప్రముచ్ఛదనము చేయనిచో నిపుడు నా ప్రాణములు నిలువవు. ఎన్నితప్పపను లొనర్చినను ప్రాణములు నిలుపుకొనుటయేగదా ముఖ్యధర్మము." అని తలఁచి మెల్లగాఁ

బిల్లి నడకలతో నాతఁడా గృహము తలుపు కిఱ్ఱుమనకుండ గొంచె మోరవాకిలిగా తెఱచి తనదేహమునుదూర్చి లోనఁ బ్రవేశించెను. అందులోపల దీప ముందు నా పోదునాయన్నరీతి వెలుఁగుచుండ నద్దాని నెగసనద్రోచి యావెలుగున వంటిల్లు బ్రవేశించెను. సంతర్పణముకాఁగా మిగిలిన పదార్థములెల్లఁ బాత్రములలోఁబెట్టి మూతలువేసి యందుంచిరి. అవి గుణనిధి కన్నులఁ బడెను. అంత నాతఁడు గ్రుక్కిళ్లు మ్రింగుచు నొక పక్వాన్న పాత్రమును చేతితో లంకించుకొని యీవలకువచ్చి తినవలె ననుకొనుచు సన్నసన్నగ వచ్చుచుండఁగా విధివశమున వాని కాలిబ్రేలొక్కటఁ బరున్న యొకని దేహము తాఁకెను. దానిచే వాఁడు తత్తరపడుచు లేచి "దొంగ దొంగ" అనుచు కేకలుపెట్టెను. అంతె నచటివారెల్లఁ ద్రుళ్ళిపడుచు లేచి కేక లిడుచు గగ్గోలుపెట్టిరి. గుణనిధి మాత్రము తాను దొంగిలిన యన్నపాత్ర విడువక భయపడుచునే చావుపఱుపులెత్తెను. వారిలో గొందఱు చేపాటికఱ్ఱలను చేతఁబూని వాని వెంబడించుచుఁ దఱిమిరి. కొంతదూరము పర్వులెత్తుసరికి గుణనిధి యా యాసపడిపోయి యన్నపు గిన్నెను విడిచి బోరగిలఁబడెను. వెంటనే వార లాతని పట్టుకొని పెడరెక్కలుకట్టి యీడ్చి తెచ్చి యొకచెట్టునకు బంధించి పిమ్మట నాతని కారాగారమునఁ బెట్టించిరి.

గుణనిధి చెరసాలయందు బంధింపఁబడి మిక్కిలి యిక్కట్లు పడుచుఁ దన చిన్నతనపుఁ బనులకు మిగుల పశ్చాత్తాపతప్తుఁడై విచారించుచుండెను.

పంకువంటి సంసారము చివఱకెట్టి దుర్గతిపాలైనదో చూచితిరా ? కావున మనపిల్లల విషయమై తల్లిదండ్రుల బాధ్యతలు చివరివఱకు నిలువనిచో నా బాలురు గుణనిధివలె చెడుదురు. ఆ సంసారము పలు కష్టములపాలై దుందుడుకులకు గుఱియగును. పరామరిక యెట్టివారును మానుకొనరాదు. 'మర్దనం గుణవర్ధనం' అను నార్యోక్తి యెన్నటికిని వ్యర్థము గాదు. లాలించి ప్రేమించుటవలన బాల బాలికలు చెడిపోవు దురు. వారి నెల్లవేళల సదుపాజ్ఞలలోనుంచుట, మిగుల శ్రేయము. వారికి, భయము భక్తియు నలవఱచుట గురువుల బాధ్యతయే గాక ముఖ్యముగాఁ దలిదండ్రుల బాధ్యతయై యున్నది. వారు దురభ్యాసముల కలవడినచో తల్లియైనఁ దండ్రియైనను వానిని మొదటలోనే పోఁగొట్టనెంచవలెఁగాని వారి తప్పులు దాఁచ రాదు. అట్లుపేక్షించినచో గోటితో మీటిన పోవు దానిని గొడ్డలితో మీటవలసివచ్చును. కావున సంతాన వర్ధనముతో పాటు తత్పాలనమునగూడ జనకు లేమఱకుందురు గాక !



# మణిమాల



## ఘోషయాత్ర

ఇతరులతో గలిసిమెలసియుండుట మనుజస్వభావము. అట్టి కలయికనే సహవాసము, సంసర్గము, సాంగత్యము, స్నేహము మున్నగు పదములతో వ్యవహరించుకొనుచున్నాము. ఈ సహవాసము మంచిచెడ్డలాలోచించి తగినవారితో చేయుచుండవలెగాని తనకు సరిపడనివారితోఁగాని నీచులతోగాని మూర్ఖులతోగాని దుష్టులతోగాని స్నేహమొనర్చుట మిగుల ప్రమాదకరము. దుష్టసహవాసము దుర్గుణములఁగలిగించి దురాలోచనలు దుష్కృత్యములు జేయించును. మఱియు నది గొప్ప ప్రమాదములలోఁ గూలద్రోసి యపకీర్తి పాలొనరించును. సత్సాంగత్యము మనుజులకు సర్వవిధముల మనశ్శాంతిని సుఖమును జేకూర్చును. ఆరునెలలు సావాసమొనర్చినచో వారు వీరగుదురను లోకోక్తి యీ సహవాస విశేషమువలన గలిగినదే. మఱియు వారివారి గుణము లొకటియైనగాని సహవాసము సాధారణముగా కుదురదు. సజ్జనులు దుర్జనులతో స్నేహము జేసిన జెడిపోవుదురు. మూర్ఖులు సజ్జనులతో కలిసి మెలసి తిరిగిన బుద్ధిమంతులగుదురు. దుష్టుఁడు దుష్టులకూటమికే

యిష్టపడును; సజ్జనుల దరి జేరడు; వారి సలహాల నామోదిం చడు. అనేక కష్టములపాలగును. ఈక్రింది భారతకథ దీనినే సూచించును.

దుర్యోధన, దుశ్శాసన, శకుని కర్ణులు నలుగురిని దుష్ట చతుష్టయ మందురు. దుర్యోధనుఁడు వీరలతో యోచనలు చేసి పాండవుల ననేకవిధముల పీడించి చిట్టచివరకు ద్యూత మున శకుని మోసకృత్యములచే వారి సర్వస్వము నరుపుకొని పాండవుల నడవుల బాల్సెసెను.

దుర్యోధనుఁడు సూతసూనుఁడగు కర్ణునితో సహవాస మొనర్చి యాతనినే సర్వవిధముల నమ్మి తన సర్వస్వము నాతని చేతఁబెట్టి తన యింటి కార్యమునకును ఖడ్గమునకు నాత నినే పెద్దగఁజేయుచుండెను. ఆతనిమాట యున్న బ్రహ్మాస్త్రము నకు వలె సుయోధనుడు కట్టువడిపోవుచుండెను. ఉభయుల యాంతర్యము లేకమై సర్వకార్యములందును బ్రవర్తించుచుం డెను. వారల వ్యక్తులు భిన్నములుగాని మనోవాక్కాయ కర్మములన్నియు నొక్కరూపమే.

ఇట్లుండ నొకనాఁ డుభయులును రహస్యమున సమావి ష్టులై యొక యాలోచనము చేసిరి. అపుడు కర్ణుడు "పాండవు లిపుడు మిగుల కష్టముల ననుభవించుచు ద్వైతవనమందలి యొక చెఱువుగట్టున నున్నవారలని విన్నాము. నీవు సమస్త సంపదలతో తులతూఁగుచున్నావుగాన నీవచటికి వెడలి వారికి నీలక్ష్మియంతయు గన్పఱచి వారికి బాధకలిగించుట మంచిది.

నిన్ను, నీ మహా వైభవమును గాంచి పాండవులు గుండెలు బ్రద్దలగునట్లు విచారింతురు. నెచ్చెలులను సంతోషపెట్టుట యు పగతురను బాధించుటయుగదా సంపద లున్నందుకుఁ జేయవలసినవని. తాము సుఖముగానుండి శత్రువులు బాధ పడుచున్నప్పుడు వారిని చూచుచు సంతసించుటతో నేమహా సంపదలు సాటియగును ? ఓ కౌరవేశ్వరా! నారబట్టలుదాల్చి కందమూలములు, ఆకుకూరలు తినుచు మహావనలలో మునిఁగి యున్న మన గర్భశత్రుడగు నర్జునునకు మన రాజ్యవైభవ ముల గన్పఱచి వాని నేడ్పించుటకంటె నీకు ధన్యతయున్నదా? మీరు మీయంతఃపుర కాంతలతో, మీ రాణులతో వెడలి దాసదాసీజనములు మిమ్ము సేవించుచుండ పాండవపత్ని ద్రౌపది మిమ్ము చూచెనా, గుండెలు తటుగుకొనిపోయి క్రుళ్ళి కుమిలి యేడ్చిపోదా? అట్లామె యేడ్చుచుండ మన హృదయములు సంతోష సాగరమునఁ దేలియాడవలదా ? కావున నీవు తప్పక పాండవుల నేడిపింపవలెను. అందులకు మే మాదఱము సాయపడుదుము. ఏమందువు?" అని హెచ్చరింప దుర్యోధనుఁ డుప్పొంగి కొంచెమాలోచించినట్లు నటించి తల పంకించుచుఁ గర్ణునితో నిట్లనెను.

"మిత్రమా ! నాహృదయములోఁగూడ నీతలఁపు లేక పోలేదు. దానికి నీవు దోహదమొనర్చితివి. కాని మనము ద్వైతవనమునకుఁ బోవుటకు మాతండ్రిగా రంగీకరింతురా ? అక్కడఁ బాండవులు నివసించుచుండుట యాతఁ డెఱిఁగిన

విషయమేగదా ! మనమిప్పుడే కోరిక లోనిడుకొని యాతని యాజ్ఞవడయందలంచి యడుగుదుమో వెంటనే యాతఁడు "వీరు పాండవులతో కలహింపఁదలంచి యిట్లడుగుచున్నారు" అని మనపోక నంగీకరింపడు. మఱియు వారు గొప్ప పరాక్రమ సంపన్నులనియు, మహా తపశ్శక్తి కలవారనియు, మా తండ్రి నమ్మకము. నమ్మకమేగాక వారన్నంతనే భయము. వారిని దలంచి యెన్నిసారులు మనయెదుట నాతఁడు బాధపడెనో నీవెఱుఁగవా ? మాతండ్రి నటుంచుము. అతనిదగ్గఱ కాచికొని యుండిన యా విదురుఁడు మనకు గోతులు త్రవ్వుచుండుటయు సర్వదా పాండవులఁ బొగడుచుండుటయు తేటతెల్లమే. మన తలంపాతని కేమాత్రము పొడగట్టినను విఘ్నముచేసితీరును. కాన నతి రహస్యముగా నీవిషయమునుంచి మనము ద్వైత వనమునకుఁ బోవుట కేయుపాయము పన్నిన మా తండ్రి యంగీకరించునో యది నీవును బుద్ధికుశలుఁడగు మామయు నాలోచింపుఁడు. రేపు పెద్దల నొడఁబఱచి వెడలుదము." అని యప్పటి కాతని బంపివేసెను.

మఱునాఁడు కర్ణుఁడు దుర్బుద్ధియగు శకునితోఁ గలిసి దుర్యోధనుని కడకు వచ్చి యిట్లనెను. "రాజా ! నీవు చెప్పిన విషయమునుగూర్చి రేయెల్ల మేమిరువురము నాలోచించుచునే యుంటిమి. కొంతసేపటికి మా యిద్దఱకుఁగూడ నొక మంచి యుపాయము తోఁచినది. ఏమందువా ? విను. ద్వైతవన ములో మన గోకదంబము లున్నవిగదా ! అది నరపతియగు

మీ పితరునకు విదితమే ! వానికి క్రూరమృగములబాధ మిక్కుటముగా నున్నదని యొక గొల్లవాని నటనుండి రప్పించి చెప్పింతము. దానిని పోగొట్టుటకై మీ తండ్రి తప్పక సిన్ను బొమ్మనితీఱును. ఆనెపమున మన చతురంగసైన్యముతోఁ బోయి మన యభీష్టము నెఱవేర్చుకొందము." అని చెప్పగా దుర్యోధనుఁడు "చక్కని యుపాయము. చక్కని ఆలోచనము" అని సంతసించి యొకరి చేతు లొకరు చఱచికొనుచు అట్టహాసమొనర్చుచుఁ జనిరి. పిమ్మట సమంగుఁడను పసుల కాఁపరి ద్వైతవనమునుండి వచ్చి వృద్ధరాజును సమీపించెను. తోడనే ధృతరాష్ట్రుఁడును "ఏమిరా ! మన పశువులు క్షేమమా ? అచటి బీళ్ళలో గోవులకుఁ దగిన మేఁత యున్నదా ? అచటి చెఱువులు జలపూరితములై యున్నవా ? అని ప్రశ్నించెను. వాఁడు వంగి వంగి ప్రణామంబిడుచు నిట్లనెను.

"బాబయ్యా ! దండములు. మన పశుసంపద దినదిన ప్రవర్ధమానముగా నున్నది. వచ్చికపట్లు నవనవలాడుచున్నవి. తటాకములు జలసమృద్ధములై యున్నవి. మాకందఱకుఁ గుశలమే. కాని బాబయ్యా ! క్రూరమృగముల బాధ భరింపలేకున్నాము. దినదినముగూడ రెండు మూఁడు లేఁగలనో, గోవులనో, ఎద్దులనో వాలుమెకములు చంపుచున్నవి. ఆ భయముచే నెండవేళలందుఁ జెట్టునీడల నిలిచి హాయిగా నెమరు వేసికొనుటగూడ మన పసువులు మానినవి. మిక్కిలి బెదరుచు అదరుచునే యవి మేయుచున్నవి. ఏగడియ కా గడియ మేము

కూడఁ బ్రాణములు అఱచేతఁబెట్టుకొని గడపుకొనుచున్నా ము. స్వామీ ! మాకీ బాధ తప్పించు నుపాయము తామను గ్రహింపకున్నచో మేమిఁక బ్రతుకనేరము. మన గోవులను దక్కవు" అనెను.

ఆపలుకులకుఁ బ్రక్కనేయున్న కర్ణుఁడును శకునియు రాజుతో "దేవా ! అట్లయినచో నాలస్యముచేయక క్రూర మృగములఁ జంపుటకును, మన పశువులను గాపాడుటకును మీ కుమారుని సుయోధనుని బంపుఁడు. అతఁడు మిగుల సమర్థుఁడు. మనము ద్వైతవనమునకు వేఁటాడఁబోయి చిరకాల మైనది. లోఁగడఁగూడ నిట్టిబాధలు కలుగుచున్నవని గొల్లలు వచ్చి గొల్లుగొల్లున మీ పుత్రునితో మొఱపెట్టుకొనుట మే మెఱుఁగుదుము. ఇంక నాలస్యముచేసినచో దేవరవారి గో సంపదకే ముప్పువాటిల్లును." అని యనెను. ఆపలుకులు విని గ్రుడ్డిరాజు కొంచెమాలోచించి కర్ణునితో "నాయనా ! నీవ న్నది నిజమే. గోవులను గాపాడవలసినదే. వాలుమెకములను వేఁటాడవలసినదే ఈరెంటును మనకు తప్పనిపనులు. కాని ఆ వనమందే తేజశ్శాలురగు పాండవులు నివసించుచున్నారు. వారు గొప్ప తపస్సంపత్తిగలవారు. వనవాసముచేయుచు నెన్నో యిక్కట్టు లనుభవించుచున్నారు. అట్టివారిని జూచి మీరు తప్పక చులుకనచేయఁ దలఁతురు. దానితో నా మహా సింహములు చెలరేఁగి గర్జించి కోపాగ్నిచే మిమ్ములను గాల్చి వేయగలవు. లేదా వారి యస్త్రప్రభావముచే మిమ్ము జంపి

వేయుదురు. పూర్వముగూడ మీచేతఁ నిడుమలు పెక్కులు పడి పాండవులు చాల నొచ్చియున్నారు. అట్టి మీరు కన్నులఁబడి నంతనే యా భీముడనెడి నల్లత్రాఁచు బుస్సునుచు లేచి మీ మర్మములను ఛేదింపకుండదు. మఱియు నే యస్త్ర శస్త్రములు లేకుండగనే ప్రపంచమును సుకరముగ జయించిన యర్జునుఁడు నేఁడు దేవేంద్రునివలన దివ్యాస్త్రములను సంపాదించికొన్నాఁడు. యుద్ధములో నాతని జయించుట కెవరికిఁ దరము? కాన మీరక్కడికి బోయితిరా, తప్పక వారిని రెచ్చ కొట్టినవారగుదురు. తోడనే మీకును వారికిని యుద్ధము సిద్ధము. కాన నేను దగినవారిని ఘోషరక్షణకై పంపెదను"

అంత శకుని, "మహారాజా! పాండవులను మే మెఱుఁగమా! వారి పౌరుషములఁ దెలియమా? మేము వారల కప్రియ మేల చేయఁ దలఁతుము? ఒకవేళ చేయుదుమే యనుఁడు. తన ప్రతిజ్ఞను ధర్మజుఁడేల యతిక్రమింపఁగలఁడు? అతఁడు సత్యము దప్పునా? ఆతని మతమును దమ్ము లెట్లతిక్రమింతురు? కాన మేము వారిని చెనకుటయు వారు మాతో యుద్ధమొనర్చుటయుఁగూడ జరుగవు. సత్యము చెప్పుచుంటిని. మేము వేఁటాడవలెనను నుబలాటముతో ముచ్చటపడుచు న్నాము. దానికి గోరక్షణకార్యము తోడుగ వచ్చినదిగదా! మా సరదా దీర్చవలదా? ఇంతమాత్రకే కీడు వాటిల్లునా?" అనెను.

శకుని మాటలు నిజమేయని నమ్మి "నాయనలారా! అట్లైన మీరెల్ల బుద్ధిగలిగి ప్రవర్తించుచు కార్యము నెరవేర్చుటయం దాలస్యముచేయక పోయిరండు. అచట లేనిపోని చిలిపి చేష్టలుమాత్రము చేయవలదు. చెప్పితినిగదా! మరలి మీరు వచ్చువఱకు నాప్రాణములు మీమీఁదనేయుండును. భద్రము" అని యంగీకరించెను. ఆ పలుకులకు దుష్టత్రయము తమ పాచిక పడినదిగదా యనుకొని గొప్ప సంతోషమంది నగర మందీ వార్త చాటింపించెను.

అంత దుర్యోధనుఁడు మిగుల సంతసించుచు జీరచీనాంబరములు ధరించి, ఆభరణము లలంకరించుకొని మైపూఁతలు పూసికొని, ప్రయాణసన్నాహమున నుండెను. అతని తమ్ములును, బందుగులును వారివారికిఁ దగిన వాహనములతో సిద్ధపడిరి. పల్లకుల నెక్కి వారిభార్యలు మంచి మంచి యలంకరణములతో పయనమైరి. పౌరులు తమ స్త్రీలతోఁగూడి మహానందముతో నాయత్తమైరి. గుఱ్ఱములు, డోలికలు, ఏనుఁగులు పల్లకులు, బండ్లు రథముల నెక్కి పెక్కువేలమంది పయనములు సాగించుచుండిరి. వంది వైతాళికులు, పణ్యాంగనలు, వైశ్యులు, విటవిదూషకులు వేనవేలనుగమించిరి. ఇట్లా యాత్ర రెండుక్రోసులమేర నాక్రమించి యొక ప్రవాహము వలె నుండెను.

ఆరీతి మహావైభవముతో వారా రేయింబవళ్ళు పయనించి మఱుదినమున నెన్నో పర్వతములు, విపినములు, నదులు

నతిక్రమించి తమ ఘోషములున్న వనము ప్రవేశించిరి. అం దొక యందమైన ప్రదేశమున పటకుటీరము లమరించుకొని నివాస మేర్పఱచుకొనిరి. దుర్యోధనుఁడును దన పశుసంపదను గాంచి మహానంద మందుచుండెను. ఆ యడవియం దేవైపు చూచినను గుంపులు గుంపులై నిర్భయముగా పశువులు మేయుచుండెను. ఒకప్రక్క మల్లెలవలెను, శంఖముల రీతిగను, చంద్రునిమాడ్కి, మంచుపోలికను, తెల్లనై మీఁద నీఁగ వాలిన జాఱిపోవునంతటి బలుపుతో గోవులు కలకలలాడు చుండెను. వేఱొకవైపు కడిమిపూలవలెను, అగరురీతిగను, మేఘములపోలికను, నీలమణులవలెను, నల్ల నల్లనైన పశు బృందములు కన్నుల మిఱుమిట్లు గొలుపుచుండెను. ఇంకొక వైపు మంకెనపూలవలెను, కాంచనములవలెను. చంపకము లవలెను, వర్ణములొప్పగా నేత్రాభిరామమై తిరుగు గోకదంబ మును దుర్యోధనుఁడు చూచి యుప్పొంగిపోయెను. ఆ మంద లలో లేగలు తల్లులపాలుత్రావి చంగు చంగున గంతులు వేయుచుండ, కోడెలు తోఁకలెత్తి క్రేళ్లుఱుకుచుండ, ఆఁబోతు లు ముంగాళ్ళచే దుమ్మునెగురఁజిమ్ముచు అంకెలు వెట్టుచుండ, ఎద్దులు పిక్కబలిసి బుసలుకొట్టుచు నొకదాని నొకటి కుమ్ము కొనుచు కుస్తీలు పట్టుచుండ, పాలయావు లంబారవములు చేయుచుండ పైలకాఁపు లదలించుచుండ పట్టరాని యానంద మందుచుండెను. అప్పుడు కొందఱు గోపాలకులు రాజుదరిచేరి సవినయముగా నమస్కరించుచు ఆ గోవుల పేరులను, తల్లుల

ణములను చెప్పుచుండిరి. వానిని వినుచు సుయోధనుఁడు తన మహారాజలక్షణములు మెఱయఁ గొన్ని కొన్ని సలహాల నొసంగుచు, తగిన రక్షకులను నియమించుచు, దన పరివార జనమును స్నేహితులును గలిసి వివిధములైన గోక్షీరములను రుచిగొనుచు నా ప్రదేశమెల్ల విహరించుచుండెను.

కొండొక సేపాతఁ డట్లు విహరించి వేఁటాడవలెనను నుత్సాహముతోఁ బరిజనులను బురికొల్పెను. వారందఱును మహాట్టహాసము లొనర్చుచు వనమెల్ల నిమిషమాత్రములో నల్లకల్లోలము కావించిరి. లేళ్లు చెదరి చెదరి గుంపులు గుంపులై పరువులెత్తి గకావికలగుచుండెను. కొందఱు మదపు టేనుఁగులఁబట్టి కట్టివైచుచుండిరి. కొందఱు సింగములను, పులులను, ఏదులను చంపుచుండిరి. వారందఱికన్ని విధముల చేఁదోడగుచు సుయోధనరాజు అయ్యడవిని వేఁటలాడెను. ఇట్లాతఁడు ఆ విపినమందు నిరంతరము పరిమళించు తామరలు గల చెఱువులను గాంచుచు, తుమ్మెదల రొదలను, కోకిల కూజితములను, చిలుకల కలరవమును, గోరువంకల కోలాహలమును, బరిజన సమేతముగ నాకర్ణించుచుఁ గ్రమక్రమముగా ద్వైతవన సరోవరమును చేరుకొనెను. ఆ సమీపమందుననే ధర్మరాజు మునిజనులతోఁ గూడినవాఁడై వన్యములగు కాయలు దుంపలు భుజించుచు సద్యస్కందమను యజ్ఞము చేయుచుండెను. ఆ సంగతి తెలిసి దుర్బుద్ధియగు దుర్యోధనుఁడు దుర్మార్గులగు కర్ణ దుశ్శాసనులతో నాలోచించి యాసరోవ

రము దరినే క్రీడాగృహములు కట్టుఁడని పరిజనుల నియో గించెను.

రాజాజ్ఞ కాఁగానే సేవకు లట క్రీడాగారములను సిద్ధపఱుప సమకట్టగా కొందరు గంధర్వు లతిత్వరితముగా జను దెంచి పనివారలతో నిట్లనిరి. "ఓయీ ! ఎవరి శలవు గైకొని మీరిచట గృహనిర్మాణ మొనర్చుచున్నవారలు ? ఇది చిత్రసేనుఁడను గంధర్వరాజు విహరించుటకై నిర్మింపఁబడిన వనము. కావున మీరిచట నిముసము నిలువఁవీలు లేదు. పొండు. తొలఁగుఁడు" అనిన వారు నావార్త దుర్యోధనునకు దెలిపిరి. అతఁడు కొందరు సైనికులను గంధర్వులకు బుద్ధిచెప్పుడని పంపెను. వారు గంధర్వులతో "ఓయీ ! మీరిట్టి యాగడము చేయు చున్నారేల ? ఈ ప్రదేశ మెవ్వరిదని తలచితిరి ? మహాబల శాలియు, మహాబాహుఁడునగు మా దుర్యోధన చక్రవర్తి యిచట గ్రీడాగృహములు నిర్మింపుచున్నాఁడు. అతఁడీ కమలా కరమునకుఁ గ్రీడార్థము ప్రియకామినులతోఁ గూడి వచ్చియు న్నాఁడు. మీరిటనుండ వీలు లేదు. ఇది రాజశాసనము" అని గట్టిగఁ బలికిరి.

అంత గంధర్వులు కోపావిష్టులై యొకరిమొగ మొకరు చూచికొనుచు వకావకన నవ్వుచు వారల కిట్లనిరి. "ఆ, ఎవరా దుర్యోధనుఁడు ? ఎవఁడా చక్రవర్తి ? అతఁడు మిగుల నవివేకి యనుకొందుము ? ఎదుటివా రెట్టివారో తా నెట్టివాఁడో యను వివేచన మీ రాజునకు శుద్ధశూన్యము కాఁబోలును.

మానము దక్కించుకొని యిచ్చోటు విడిచి పొమ్మనుఁడు. ప్రాణములమీఁద నేమాత్ర మాశయున్నను నిట్టి నిరర్థక వ్యాపారము లొనర్పవలదని మా మాటగాఁ జెప్పుఁడు. మఱి మాటాడక బుద్ధితెచ్చుకొని వచ్చినదారి పట్టుమని చెప్పుము” అని పరుషముగాఁ బలికిన నా సైనికులా మాటలు యథాతథముగ కురుపతి కెఱింగింపఁగా నతఁడు మితిమీఱిన యమర్షమునకు వశుఁడై తన తమ్ములను దొరలనుగాంచి మీరందఱు మీ మీ సైన్యములఁగూడి దుర్వినీతులగు గంధర్వుల గర్వమణఁచి యీ సరోవర మాక్రమింపుఁడు. దేవేంద్రాది దేవతలు వారికి సహాయమై యుద్ధమువచ్చినను శమింపక జయింపుఁడు. వేఁగ పొం”డని నియోగించెను.

రాజాజ్ఞ యైనతోడనే చతురంగబలమును గూర్చికొని సింహనాదములు దిక్కులందు బిక్కటిల్లగా మహాసైన్యము గంధర్వవరులతోఁ దలపడఁ బయనమయ్యెను. అట్లు వచ్చుచున్న కురువీరులకుఁ గొందఱు గంధర్వు లడ్డమువచ్చి ప్రశాంతవచనములతో “అయ్యా! ఒక్కసంగతి వినుఁడు. ఇది గంధర్వరాజగు చిత్రసేనుని ప్రదేశము. ఇక్కడికి మీ రేలవచ్చెదరు? అనవసరముగా నన్యాయముగా నొకరి ప్రదేశ మింకొకరువచ్చి యాక్రమించుట ధర్మమా? మీకు మాతో విరోధమెందులకు? యుద్ధమనఁగా మాటలు మూటలుగట్టుట కాదే? ఉభయపక్షములందును నెత్తుటేరులు ప్రవహించునే! పెక్కుసైన్యములు, బందుగులు, స్నేహితులెల్ల చత్తురే! ఇట్టి

దురవస్థకు మనము పాల్పడనేల? మానుకొని వెనుకకుపొండు" అని వచించుచుండ నా మాటలు లెక్కసేయక యార్చి పేర్చి సేనానాయకులు వారలపై ప్రచండమైన యస్త్రశస్త్రములను గురిపించిరి. పాప మా గంధర్వు లాశత్రువుల బారికిఁ దాళఁగఁ జాలక విషయమంతయు గంధర్వపతి కెఱిఁగించిరి. అతఁడు పట్ట రాని రోషావేశముచే నెఱ్ఱబాఱిన మోముగలవాఁడై "లెండు. వెడలుఁడు. ఆలసించెదరేల ? 'ఆలస్య మమృతంవిషం' అను నార్యోక్తి వినరా? వెంటనేపోయి యా కౌరవులనో, గిరురవు లనో రూపులు మాపి రండు" అని పెక్కువేలమంది మహా యోధులను వారలమీఁది కనిపెను.

అట్లు పంపఁగా కుంతము, కార్ముకముఁ గద, అసి, తోమరము, పట్టసము మున్నగు యుద్ధసాధనములతోఁ బర్వ తోపమానమైన దేహముగల యా గంధర్వులు నార్చుచు, ప్రచండతేజము మెఱయ నొక్కమాఱుగా కురుసైన్యమును దాఁకిరి. ఉభయులకును దీవ్రమైన మహాసంగ్రామము జరిగెను. అట్లు గంధర్వులు బెట్టిదముగా నొప్పింపఁదొడఁగఁగా కలఁత పడి దుశ్శాసనాది కౌరవులు తమ తమ సైన్యములతో గూడి పరువులెత్తిపోయి దుర్యోధనుచెంత నిలువఁబడిరి. అపుడా యని మొనయందు కర్ణుఁ డొక్కఁడును స్థిరుఁడై నిలువఁబడి గంధ ర్వుల నాపి వారి దేహములు తన యాయుధములచే ఖండిం చుచు ఘోరముగ బోరుచు నిమిషమాత్రములో శత్రుసైన్య మును బటాపంచలొనర్చెను. కాని యదేమిచిత్రమో గాని

మరల మరల గంధర్వులు పై పై శతసహస్ర సంఖ్యలతో నేతెంచిన, భూమియంతయు గంధర్వమయమైనట్లు గోచరిం చెను. అప్పుడా కదనరంగమునుగాంచి తన తమ్ములును శకు నియు మహాసైన్యములును దోడురాఁగా దుర్యోధనుఁడు యుద్ధ సన్నద్ధుఁడై కర్ణునికి బాసటయై చనెను. పిమ్మట నుభయసైన్య ములు తాఁకి జగత్ప్రళయముగ మహాహవము సలిపిరి. రెండు మూఁడు గడియలలో గంధర్వులెల్ల వేసంగి యెండకు మాడి పడిన చీమలవలె చచ్చిపడిరి, మిగిలినవా రీ సంగతియంతయుఁ జూసగుచ్చినరీతి గంధర్వప్రభువునకు నివేదింప నాతఁ డంత యు విని కోపాటోప ముట్టిపడ మదగజమువలె బయలుదేరి కౌరవులను దాఁకెను.

అట్లు గంధర్వులు కలియఁబడి తమమాయ యచ్చుపడు నటుల మాయాస్త్రములను బ్రయోగించుచు, ముందు వాయు ప్రసారము లేకుండఁ జేసిరి. పిమ్మట సూర్యప్రసారము పోకా ర్చెను. వెంటనే కౌరవసైన్యములు ప్రాణములుపోవ నేలపై బడెను. తేరులు కూలెను. హయములు, కరులు నూపిరాడక పీనుఁగులై పడిపోయెను. మిగిలిన కొందఱను గంధర్వులు లక్షోపలక్షలు చుట్టిముట్టి చిత్రవధ గావించిరి. చావఁగా మిగి లిన కొందఱు అవ్వియచ్చరుల పరాక్రమము సహింపఁజాలక చెదరి చెదరి ధర్మరాజున్నవైపునకు తోలఁగఁ బాఱిరి. అప్పుడు రాధేయుఁ డొక్కఁడు నజేయుఁడై కులపర్వతమువలె కదలక నిలిచి గంధర్వులు కురియుచు బాణవర్షమున మునుఁగుచుఁ

దేలుచుఁ దన కోపిక యున్నంతవఱకు పెనఁగులాడుచుండెను. సోదర సాంబలసహాయుఁడై దుర్యోధనుఁడు కర్ణునకు సాయప డెను. అంత వారల ననంత బలులగు గంధర్వులు చుట్టుముట్టి కొందఱు సూతుని, కొందఱు గుఱ్ఱములను, కొందఱు ధను ర్దండమును, కొందఱు రథచక్రములను, కొందఱు శ్వేతఛత్ర మును, కొందఱు కాడినికేతువును, ఇఱుసును దునిమివైచి కర్ణుని విరథునొనర్చిరి

తోడనే కర్ణుఁడా తాఁకుడు సహింపనోల్లక వికర్ణు రథ మెక్కి యుద్ధభూమినుండి పారిపోయెను. దుర్యోధనుఁడు మాత్రము విముఖత చెందక శత్రువుల నెదిరించి పెనఁగుచుండ చిత్రసేనుఁ డాగ్రహావిష్టుండై యాతని రథముగూడఁ జూర్ణ మొనర్చి విరథుగావించెను. అంతటితో నూరకుండక యాతని కేశముల మెలివైచి నేలఁబడవైచి పెడకేలుగట్టి సింహనాద మొనరించెను. వెంటనే మిగిలిన గంధర్వులు తృటికాలములో జయానందము నటించుచుఁ బరవళ్ళు త్రొక్కుచు యతని వనితాజనంబును దశోదరులను, వారి పుత్రులను, మంత్రు లను పట్టి బంధించి చిత్రసేనున కొప్పగించిరి. మిగిలిన కౌర వులును పౌరులును అమాత్యులును చెదరి యాక్రోశించుచు పఱువులెత్తుచు ధర్మరాజును శరణుసొచ్చి యిట్లు వాపోయిరి.

"దయాస్వరూపా, ధర్మమూర్తి! మీ తమ్ములగు కౌర వులు మహాపదకు గురిమైరి. వారిని వారి పుత్రులను, భార్య లను, తమ్ములనుగూడ బలవంతముగా బంధించి గంధర్వులదే

యొత్తుకొని పోవుచున్నారు. వారిని జయించి కరుణనిండారగా నీ వారిని కాపాడి బంధమోక్షము కావింపుము. బంధుగు లిడుమలం బడియుండం జూచియుం జూడకయుండుట నీవంటి వానికి పాడి కాదు. నీవుతప్ప యిచట వారిని జూచువారు లేరు. అని గడగడ వణంకుచు నమస్కారపూర్వకముగా మనవిచేసి కొనుచున్నవారిని గాంచి కకపక నవ్వుచు భీమసేనుండు ధర్మరాజున కిట్లనెను.

"అన్నా ! కాంగలపని గంధర్వులు తీర్చిరి మనపని మిగుల తేలికయైనది. మనకెట్టి భారమును లేకుండగనే జయము సమకూరినది. పుట్టుకలోనుండియు నసత్యవాదియై సకల పాపకర్మములకును నిలయుమై లోకులందఱిచేత నిందింపంబడు చున్న దుర్యోధనునికిం దగిన ప్రాయశ్చిత్తమైనది. సత్యముగా నిట్టిసంఘటనము గూర్చిన విధాత యెన్నందగినవాండు. అన్నా ! మనము వనవాసాయాసమున దుఃఖితులమైయున్నవారమనియు, మిగుల లేమితో నిలమటించుచున్నామనియు, పరాధీనులమని యు నెంచి కన్నుమిన్ను గానక గర్వాంధుండై యీ దుర్న యుండు మనలను వేళాకోళ మొనర్చుటకై వచ్చినాండు. వాని దుర్నయము వానినే కొట్టినది. తత్ఫలము తమ్ములతోడను, మంత్రులతోడను, విశేషించి తన కాంతలతోడను గలిసి కుడువవలసి వచ్చినది. దేవుండు లేండా? పాపచింత లెప్పటికేని కండి ఫలిత మొసంగవా ! ఇది నిజము. ఆ పాపాత్ముని విష యమై కరుణచూపవలదు. రణంబియైన మనము సాయపడ

వలదు. మీరు మిన్నకుండుఁడు. మేము సమాధానము చెప్పె దము." అని కోపాటోపమునఁ బలుకుచుండ ధర్మరాజు మిగుల నొచ్చుకొని.

"నాయనా ! నీవట్లనఁదగునా ? ఇది పరుష సంభాషణలకు సమయమా ! మనసంతయు వికలమైపోయి చూడ దిక్కును మ్రొక్క దైవమును లేక మనలను శరణుసొచ్చిన మన కౌరవులను మన మడ్డుపడి కాపాడవలదా ? తమ్ముఁడా! ఒకే వంశమందుఁ బుట్టినవారికి ననేక విషయములను గూర్చి భేద భావము లుండవచ్చును. అందును 'మాతాపుత్ర విరోధాయ హిరణ్యాయ నమోనమః' అనినట్లు కన్నతల్లికిని బుత్రులకుఁ గూడ విరోధముగూర్చు ధనవిషయమై భేదభావము లుండ కుండునా ? ఈపాటి కారణముల వలన సహజమైన స్నేహము తప్పిపోవుననుకొంటివా ? "జ్ఞాతిశ్చేద నలేనకిం" అను నార్యోక్తి యున్నను, దమలోనివారెట్టివారైనను, అన్యులవలన పరాభవము సంభవించునపుడు అందఱును కలిసి పనిచేయవలెను. లేనిచో ధనహానియు లోకనిందయు వాటిల్లును. భీమసేనా ! మనలో మనకు విరోధములు పొడసూపినపుడు మన మైదువు రమును వారు నూర్గురును. పరులతో మనకు విరోధము గలిగి నపుడు మనము నూటయైదుగురము సుమా ! దుర్యోధనుఁడు నీతినూలినవాఁడయ్యును దన భార్యలతోఁ గూడి పరుల చేఁ జిట్టువడినాఁడు. ఇట్టి పరిస్థితి నుపేక్షించినచో మనకు కుల హానియు, మానహానియుఁ గాదా ? నాయనా ! రాజను

వానికెల్ల శరణాగతులఁ గాపాడుట విధిగదా! ఈ సంగతి నీకు వేఱె చెప్పవలెనా ? నీవంటి మహాబలశాలి కిట్టిపని చేయవలె నను ప్రోత్సాహ మనవసరము. లెమ్ము. నీవును నీతమ్ములును రథములెక్కి సర్వాయుధ సన్నద్ధులైచని సుయోధనుని చెఱ విడిపింపుఁడు" అని బోధింపఁ దిరిగి భీముఁడు ఇట్లు పలికెను.

"అన్నా! ఎంత వెఱ్ఱివాఁడవోయి! మన చిన్నతన మున నన్ను జలములలోఁ ద్రోయింపలేదా ? విషము తిని పింపలేదా ? వానికీ కార్యములందెట్టి యనుమానమైన గలి గెనా ? మనలనెల్ల లక్కయింట బంధించి యగ్నిపెట్టలేదా యీ పాపి? ఆనాఁడు శకునిని ప్రోత్సాహపఱచి మాయాజూద మాడి మన రాజ్యమును అపహరించిన కుటిలుఁడు గాఁడా వీఁడు? నిండుసభలో పెద్దలందఱును గాంచుచుండ జుట్టుపట్టి యీడ్చి యంతతోఁబోక ద్రౌపదికట్టుబట్టలను గూడ నొలిపించినదౌర్భా గ్యుఁడు కాఁడా యీతఁడు ? పుట్టినది మొదలు వాఁడు మనకు నపకారములు చేయని దినముగలదా? ఇట్టి మహాదారుణములు వాఁడు చేసియుండ వానినన్నిటిని మఱచి, దిగ్భ్రమింగి వానిని నేఁను కాపాడుఁడని చెప్పుటకు నీకు నోరెట్లాడెనోగదా! ఇట్టి వానిని కనికరించుటా ? కసిదీర్చుకోఁ తవెట్టుటా ? ఇట్లైన మనకు గార్యహాని కాదా ! అని పూర్వవైరములనెల్ల స్మరించి పలుక ధర్మజుఁడు.

"సోదరా! నీ వన్నవన్నియు సత్యములు కావందునా ? చేసినాఁడు. ఎవరికర్మము వారలనే ఘటించును. కాని యుత్తమ

శూరుఁడు తాను మిగుల దుర్బలుఁడైనను కావుమని వచ్చిన వారిని దన కోపినంత యుపకృతిచేసి పంపును. దీనజనులను గాంచి యెట్టివాఁడును నుపేక్షింపరాదు.

"శరణంబని వచ్చిన భీ
కరశత్రుని నయినఁ బ్రీతిఁ గావఁగవలయున్
కరుణాపరుల తెఱంగిది
యిరవుగ పరిగావుదీని కేధర్మంబుల్"

మన దుర్యోధనుఁడు మన బలపరాక్రమసంపదల నెఱిఁగినవాఁడుగావున మన మడ్డుపడుదుము. విడిపించి తీయుదుము. అని మనవైపు మిగుల నాసగలవాఁడై యెదురుతెన్నులు చూచుచుండును. ఇది మనకు బుణ్యకార్యమే కాక గొప్ప కీర్తికి కారణంబు ఇట్టి చక్కటి సమయము దాఁటఁ బెట్టరాదు. వేయేల? యజ్ఞదీక్షలో నేనుండఁబట్టి సిన్నింత నిర్బంధింపవలసి వచ్చినది. లేనిచో నేనే పోయియుందును. కాన మీరు వేగ ముగఁజోయి గంధర్వులను మూఁదుగఁ బ్రియపూర్వకముగా ననునయించి మనవారిని విడిపింపుఁడు. సామవచనములతోఁ గార్యము సానుకూలము కానినాఁడు పరాక్రమముచేతనైనను శత్రుల నణఁచి పని సాధింపవలయును. నాయజ్ఞము సఫలము చేయుఁడు. నామాఁట వినుఁడు. నాకోరిక చెల్లింపుఁడు. నా పెద్దతనము నిలువఁబెట్టుఁడని పదే పదే పలుకఁగా నెట్టకేలకు భీముఁ డంగీకరించెను. అర్జునుండు కురురాజు చెఱ తొలగింతు నని ప్రతినపట్టెను. నకుల సహాదేవు లుత్సాహపడిరి. అన్నలుపు

రును, ఆ ముక్తకవచులు, ఆ బద్ధతూణీరులు, ఆ కలితకార్ము కులు, ఆ రూఢరథులునై యున్న సెలవంది తొందరగా గంధ ర్వుల నెదిరింపఁబోయిరి. కౌరవసైన్యమంతయు వారితోఁగలిసి సింహనాదములు సెలఁగ నడచెను. ఇట్లరిగి వారలు గంధమాద నమునకై పోవుచున్న యవ్వియచ్చరుల గూడముట్టిరి.

అంత గంధర్వులును పెద్దపెట్టిగి తిరిగి యా పాండ వుల నెదుర్కొనిరి. ఉభయసైన్యములకును సంగరము కాక ముందే పల్కునుఁ డన్నగారిమాటలు తలఁచికొని కోపము దిగ మ్రింగికొని గంధర్వులతో "ఓయూ! మాతో విరోధమేల? కౌరవరాజును మీరు పట్టి బంధించుకొనిపోవుట మా యన్న గారగు ధర్మజుని కంగీకారము కాదు. వారి యాజ్ఞ పరిపాలింప మే మిటకు వచ్చితిమి. రాజాధిరాజగు ధర్మరాజు శాసనమిది. మాటాడక యాతని విడిచి పొండు. లేదా మీ ప్రాణమాన ములు దక్కవు." అని పలుక గంధర్వు లాతనితో "ఏమీ! ధర్మరాజుగారి శాసనమా, ఆతఁ డెవఁడు? మాకు శాసకుఁడు కాఁడే యాతఁడు! మమ్ము శాసించువాఁడు దేవేంద్రుఁడు. మా రాజు శాసనము మే మనుసరింతుము. మిగిలినవా రెంతవా రైన మాకు లెక్కలేదు." అని నిర్లక్ష్యముగాఁ బలికిరి.

"ఓహో! అట్లనా! మొదటనే తెగించి యుద్ధమునకు దిగనేల యని మీ కిట్లంటిని. మీ రేవిధముగనైన సామోపా యముచే లొంగువారువారు. కానిండు. ఇదిగో మటికొక మా ధాక చూడుఁడు. కాఁచికొండు" అని యతిభయంకరమైన

బాణములఁ బ్రయోగింపఁగాఁ బెక్కురు సమసిరి. కదనరంగ
ము పీనుఁగుపెంట లయ్యెను. వారును పాండుపుత్త్రులపై
బాణవర్షము కురియించి యర్జునుని రథమును గూల్చివైవ
నాతఁడు పదివేలమంది గంధర్వుల నొక్కమారుగా దివ్యమైన
నిశిఖములచే దహించివైచెను. ఇట్లు కోదండము పూని వారి
చప్పుళ్లచే దిక్కులను బ్రద్దలుచేయుచు నొడలెఱుంగని వీరా
వేశమున నర్జునుఁడు ప్రళయకాలరుద్రునివలె తాండవించు
చుండ, భీముఁడును, నకుల సహదేవులును మారిమసంగినట్లు
చేతికి దొరకినవారినెల్ల నల్లుల నలిపినట్లు నలుపుచు, గ్రుద్దున
కొక గుంపును గూల్చుచు నేనుఁగుల నెత్తి మోఁదుచు, విసరి
వైచుచు, మహావృక్షములచే బాది కడతేర్చుచు, పెక్కు
సైన్యమును దునుముగా రక్తప్రవాహము లందుఁ బ్రవహిం
చెను. ఇట్లు పట్టరానిపీడనంది గంధర్వులు నిలువనేరక దుర్యోధ
నాదుల చెఱలు విడువక వారి నెత్తికొని గగనమునకు నెగిరి
పోవఁబ్రయత్నించిరి. అది కనిపట్టి కిరీటి యతిరయమున నిబిడ
బాణజాలములచే దిక్కులను నాకాశవీథిని మిగుల దట్టముగా
కప్పివైవ నగ్గగనచరులు వలలోఁ జిక్కిన పులుఁగులవలె
నెటును బోవనేరక తిరిగి యుద్ధసన్నద్ధులై శరపరంపరలను
గురిపించిరి.

అర్జునుఁడు వానినెల్ల నుగ్గునూచముగావించి రోషభీష
ణాకారుఁడై భల్లబాణములు ప్రయోగింప తాటికాయలవలె
శత్రువుల తలలు భూమిపై దొరలెను. మొండెములు దిభీలు

దిభీలున మింటనుండి నేలకుఁ గూలెను. రక్తవర్షము కాలువలు గట్టెను. జగత్ప్రళయమురీతిఁ జూచువారెల్ల గడగడ లాడిపో యిరి. పిమ్మట భీభత్సు ఆగ్నేయాస్త్రమును బ్రయోగింపగా నెండిన యడవిని దావాగ్ని దహించురీతి మిగిలిన గంధర్వుల నెల్లఁ గాల్చివేసి బుసిగా నొనర్చెను. అంత గంధర్వరాజా బాణికి నిలువనేరక యదృశ్యుండై యుద్ధము చేయఁగా శబ్ద భేదులైన యస్త్రములచే నర్జునుఁడు చిత్రసేనుని సమస్త దేహ మును జల్లెడవలె తూట్లుపడునట్లు కావించెను.

అంత గంధర్వపతి యుద్ధముమాని విజయుని చేరఁజని తన పాడసూపి నిలిచిన నవ్వీరుఁడును దనకు మిత్రుడగు ఖేచర పతి విధముగాంచి యస్త్రము నుపసంహరించెను. భీమాదు లును యుద్ధము మానిరి. అప్పుడు సవ్యసాచి చిత్రసేనునితో "ఓ వీరాగ్రణీ! కౌరవవర్గముతో నీకిట్టి విరోధము తగునె టయ్యా ? సతీపుత్రసహితముగ మా కౌరవపతిని విడువుము" అని పలికెను.

అప్పుడు చిత్రసేనుఁడు "అర్జునా! దాపరిక మెందులకు. నిజము వక్కాణించుచుంటిని. వినుము. మీరీ వనమందుండి రనియు, మిగుల నిడుమలుపడుచుంటిరనియు నీ దురాత్ముఁడు తెలిసి పరమపూజ్యులగు మిమ్ముల నవహసింపఁదలఁచి వచ్చి యున్నాఁడు. ఈసంగతి నీ తండ్రి దేవేంద్రుఁడు విని కోపించి యీపాపవర్తనుని పుత్రమిత్ర కళత్రాదులతోఁ బట్టి బంధించి యీడ్చి తెండని మమ్ము బంపినాఁడు. అందులకై మేమిట

వచ్చితిమి. ఇదే వీనిని శత్రునికడకుఁ గొంపోవుచున్నాఁడను. నీవు మఱియొకవిధముగ భావింపవలదు. విరమింపుము. నీవు నాకు పరమమిత్రుఁడవుగాన నాకు నీపై కోపముగాని మాత్స ర్యముగాని లేదు" అనిన ధనంజయుఁడు "ఆర్యా! నీవు చెప్పిన దెల్ల సత్యమే. ఈ దుర్యోధనుఁడు మాకు సహోదరుఁడు. ఈతని చెఱ విడిపించి తెమ్మని మా యన్నగారి ముదల. మేమట్లు చేయకున్న నాతఁడు మిగుల విచారించుటయే గాక మమ్ము కోపించును. దేవేంద్రుని యాజ్ఞయైనను నావల మఱి వ్వరిదైనను మాయన్నకుఁ దెలియఁజెప్పి యాతఁడేవిధానము తెలుపునో యట్లుచేయుట యుచితము. నా ప్రియమునకైనను నీవు నామాట విని మా యన్నగారికడకు రమ్ము" అనఁగా నాతఁ డందులకీయకొనెను. ఇరువురును ధర్మజుని సమీపించిరి. అంత నా యజాతశత్రుఁడు చిత్రసేను నతిప్రియమున గారవించి పూజించి "మహాత్మా! మా తమ్ముఁడగు నీ సుయోధనుఁడు దమ్ములతోడను కళత్ర మిత్ర మంత్రివర్గముతోడను మీచే వధింపఁబడకుండుటకు నే నమితానంద మందితిని. మేలయ్యె. మీకారణముచే మావంశమెల్ల నెట్టిహానియుఁ బొందకుండుట మన యుభయులకును క్షేమము. మావాఁ డెట్టి యపరాధ మొనర్చినను నదియంతయు సహించి మా మొగముచూచి యైన వీని విడువలయును. తెలియకచేసిన తప్పు కాచుట మన వంటివారలకు ధర్మముగదా!" అని ప్రార్థించిన నాతఁడు శాంతచిత్తుఁడై వారి వారి చెఱలు విడిపించి పాండవులయొద్ద

నుండి సెలవుగైకొని దివమునకరిగి జరిగిన వృత్తాంతమంతయు నింద్రునికి నివేదించెను. అంత నాతఁడు రణమునఁ జచ్చిన గంధర్వులపై నమృతవర్షము కురియించి వారి నందఱను బ్రతికించెను.

పిమ్మట యుధిష్ఠిరుఁడును ధార్తరాష్ట్రులకు బంధవిమోచనము కావించి తనయెదుట తలవంచి నిలిచియున్న దుర్యోధనున కిట్లనెను. "నాయనా ! ఎంత తెలివిమాలిన పనిచేసి నట్టితివయ్యా ! నిజముగా మేమిట లేనిచో నీవని యేమైయుం దువోగదా ! ఇట్టి విషమ కార్యములు కెన్నడును దిగవలదు. మానవుఁ డూహమాలి విరుద్ధక్రియలలోనికిదిగి పూర్తిగ నశిం చును. అందును దుష్టస్నేహము మంచిమనసును సైతము విఱిచి ప్రమాదములలోఁ బడవైచును. దీనినే "పరబుద్ధిర్వి నాశాయ" అని పెద్దలందురు. కుబుద్ధికి కుబుద్ధితోడైనచో నగ్నికి వాయుసహాయమువలెనె పరిణమించి తుదకనర్థ ములు తటస్థించును. హాయిగా రాజ్యసుఖము లనుభవించుచు నింట నుండలేక దుర్బుద్ధిపుట్టి యిట్టిపని చేసితివి ! తప్పు తప్పు. నీవు సుఖముగా నీ బంధు మిత్రులతో మీ యూరుచేరుకొనుము. మఱియొకమాట. "నే నాపదలోఁబడి ప్రాణసంశయ దశనందు టయు నన్ను గర్భశత్రువులగు పాండవులు విడిపించుటయునా?" అని మాత్రము నీ హృదయమందు విషాదము చెందవలదు సుమా ! పొమ్ము" అని బుద్ధిసెప్పి పంపివేసెను.

దుర్యోధనుఁడును దీనానుఁడై యచ్చోటు విడిచి మహావిచారముతో వెడలెను. ఆతని వెంబడినే తత్పుత్రులు, మంత్రులు, సామంతులు, తమ్ములు మున్నగు వారెల్ల సిగ్గున దలలువంచి వెడలిపోయిరి. అనుజసహితుఁడైన ధర్మతనయుని ధార్మికత్వమును, శాంతస్వభావమును నచటివారెల్ల బహువిధములఁ బ్రస్తుతించిరి.

అట్లు ధర్మరాజు దయవలన విడిపింపఁబడిన దుర్యోధనుఁడు మనసులో మిగుల లజ్జపడి తలనెత్తుకొనలేక "అక్కటా! తానొకటి తలఁచిన దైవ మొకటి తలఁచెనన్నట్లు నాకు శృంగభంగమైనది. అన్యాయముగా నిరపరాధులగు పాండవులను బాధింపఁదలఁచితిని. అట్టి నాకిట్టి కీడు మూడకుండునా? ఈ పరాభవము నా జన్మమునకుఁ జాలును. ఇఁక నేను జీవించిన నొక్కటే, జీవింపకున్న నొకటే" అని తలఁచుచు లోలోన నేడ్చుచు బెదరిచెదరిన సేనలను గూర్చుకొని కొంత దూరము పోయెను. అట నొక సమప్రదేశమున డేరాలు వేయించి యందు తనపరివారవర్గముతో నివసించుచు తానొక డేరాలో నొంటిగ నొక తల్పమున శయనించియుండెను. నడుమ నడుమ తన పరాభవము దలఁచికొనుచు నాతఁడు మితిలేని వేదన పొందుచుండఁగా నప్పుడాతని గాంచుటకు కర్ణుఁడు వచ్చి యాచారప్రకార మాతని దర్శించి యిట్లనెను.

"రాజరాజా! కుశలమా! కామరూపులగు నా గంధర్వుల యుద్ధ మెంతప్రబలమైనదయ్యెను! వారి పరాక్రమములు

మనుష్యాతీతములు. వారి పట్టుదలయు, యుద్ధకౌశల్యమును, వారల కలసికట్టుతనము మిగులఁ గొనియాడఁదగినవి. ఇట్టి దారుణసంగ్రామము నే నెన్నఁడును గనివిని యెఱుఁగను. ఎట్టి శత్రువునేని యెదుట నిలిచి ముఖాముఖి యుద్ధమొనర్చి యోడింపనగునుగాని, కంటికి కానరాని స్వరూపముగలవారి నెవరు జయింపఁగలరు? చంపినకొలఁది చెదలపుట్టవలె లక్షోపలక్షలు కోటానుకోట్లు నిమిష నిమిషమునకు నుద్భవించుచుండ దేవుఁడైనను వారల జయింప వెనుకంజవేయును.

అట్టి మహామహులను నీవును నీ తమ్ములునుగూడి పురుషకారముఁజూపి గెలిచితిరి. నేఁటితో గంధర్వుల యాదుర్గర్వము పటాపంచలైనది. నీవు నా యుద్ధమును నేను పడు శ్రమయుఁ గాంచుచునే యున్నావుగదా! నే నొంటరిగఁ బోరుచుండ ననంతములైన గంధర్వసేనలు నన్ను చుట్టుముట్టి యొక్కపెట్టున బాణవర్షముఁ గురియించెను. నేను దానిని వీలైనంతవరకు కాఁచికొనుచు కుప్పలు కుప్పలుగా గంధర్వులను గూల్చితిని. రెండు చేతులవాఁడనయ్యు వేయి చేతులతో యుద్ధముచేసితిని. ఏమిప్రయోజనము! అంతుపంతులు లేని యాగంధర్వుల నడుమ నే నొంటరినై నూఱు కాకులలో నొక కోయిలనైతిని. వారల బాణములచే మిగుల నొచ్చితిని. నిలువ నోపిక లేకపోయెను. తోడనే నా రథమునుగూడ తుత్తునియలు చేసిరి. పిమ్మట విరథుఁడనై వికర్ణుని రథమెక్కిన నన్నది రణరంగము దాఁటించి దూరముగఁ గొంపోయినది. దేవా! నీవు నీ బలవిక్రమాతిశయ

ములతో నోపికపట్టి నిలువఁబడి ప్రతివీరుల నోర్చితివి. నేను ప్రాణములన్నియు నీమీఁదనే పెట్టుకొని కట్టెతోమాత్రము నిలువఁజాలకఁ దొలఁగితిని. నీ కెప్పు డెట్టి కీడు వాటిల్లునో యనియు పరితపించితిని. దైవకృపవలన నీ వెట్టి ప్రమాదమును పొందక యక్షతశరీరుఁడవై కుశలముగానుండుట యిప్పుడు కాంచి కృతార్థుఁడనైతిని. నీవు చూపిన పరాక్రమము నేఁటి దనుక యీ భూమిపైఁ జూపినవా రెవ్వరును లేరు ఇది మహాద్భుతమైన సంగతి" అని యూరకుండెను.

ఆ పలుకులువిని దుర్యోధనుఁడు తనలో "అయ్యో ! ఈతఁడు జరిగినది తెలియక నేను నిజముగా జయించితినే యనుకొని యిట్లు పలుకుచున్నాఁడు. ఈ దురదృష్టవంతున కట్టి గౌరవము చిక్కునా ? ఇప్పు డేమని యీతనికిఁ దెలుపుదును ? ఊరకుండుటయు మంచిదికాదు." అని యనుకొని మిగుల లజ్జితుఁడై రాధేయున కిట్లనియెను.

"కర్ణా ! జరిగిన సందర్భము తెలియని నీవిట్లు పలుకుట సహజమే. ఇందు నీ తప్పేమియు లేదు. యదార్థము వక్కాణించుచున్నాను వినుము. నా యనుజవర్గముతో నే నట్లు పోరుచుండ సంకులయుద్ధము సంభవించినది. ఆ సమయమున నాకు గంధర్వపతితో పోరుజరుగఁజొచ్చెను. కొంతసేపటికి నే నాతని బాణపరంపరచే నొచ్చి యుద్ధము చేయజాలకుంటిని. అప్పుడు నన్నతఁడు పట్టి బంధించివైచెను. నన్నుకట్టుటతోడనే గంధర్వసేనలు నా తమ్ములను, భార్యలను, మిత్రులను, పరివారమును

బంధించివైచి చెఱఁగొనెను. అంతలో వారుండక మమ్ముల నందఱ నెత్తుకొని స్వర్గమునకుపోవ సమకట్టిరి. అప్పుడు మా దురవస్థ చెప్పుటకీ జిహ్వ యొక్కటిచాలదు. నాతో నేనెంత పరితాపపడితినో యది దైవమునకే యెఱుక.

అంత మిగిలిన మన సైనికులు గుండెలు తట తటలాడ దిక్కులేనివారై యేమియుఁ దోఁపక యచటనున్న పాండవుల దఱిచేరి విషయమంతయుఁ దెలిపి తమ్ము రక్షింపుఁడని వేఁడుకొనిరి.

వారియార్తి ధర్మతత్పరుఁడగు ధర్మరాజు విని తన తమ్ముల నలువురను మమ్ముద్ధరించుటకుఁ బంపెను. వారును గంధర్వుల ననునయించి మావారిని విడువుఁడని యర్థించిరి. అందులకు గంధర్వు లంగీకరింపక యుద్ధమునకే సిద్ధపడిరి. అంత భీముఁడును, అర్జునుఁడునుఁ నకుల సహదేవులును కాల యములవలె విజృంభించి గంధర్వులపై శరవర్షము కురిపించిరి.

పిదప నా బాధ భరింపలేక మమ్ములను దమ తమ సందిళ్ళ నిఱికించుకొని గంధర్వులు గగనమునకుఁ బోఁబోయిరి. వారట్లు పోవుండ నర్జునుఁడు బాణపంజరము కట్టి వారి నడ్డుకొని "ఈ దుర్యోధనుఁడు మా తోఁబుట్టువు. కావున నితని విడువలయు" ననెను.

గంధర్వరాజా మాటలకు "అర్జునా! నిన్నునే నెఱుగని వాఁడగాను. నన్నును నీవెఱిఁగినవాఁడవే. అనుచు మన దురాలోచనము మొదటినుండి చివఱవఱకు నర్జునునకుఁ దెలిపి

యీ పాపులను విడువననెను. ఆ సమయమున నాకు సిగ్గును, దైన్యము నెంతగా గలిగినవో చెప్ప నోరాడదు. "అయ్యో ! ఈ భూమికి రంధ్రమున్న బాగుండును. అందు దిగి పాతాళము చేరి పరులకుఁ గానుపింపకుండఁ దల దాఁచికొందును." అని నాకనిపించినది. కర్ణా ! ఇన్నిపాట్లుపడి, ఇంత పరాభవమంది యీ ఆతిగుండెలతో, మానాభిమానములు విడిచి జీవశ్చవము నై చచ్చినట్లు పడియుంటిని. పిమ్మట మమ్మందఱను ధర్మరాజునొద్దకుఁ గొంపోఁగా నా దయామయుఁడు మమ్ము విడిపించెను. ఇది మా వృత్తాంతము."

మన శత్రువులు చూచుచుండఁగా నిట్టి భంగపాటు నందితిని. నేను జనులెల్ల నవ్వఁగా నెట్లు బ్రదుకఁగలను ? ఈభూమి నెట్లేలుదు ? ఎట్లు పెద్దలలో సంచరింపఁగలను ? అయ్యో ! ఆయుద్ధమున శక్తిగల్గినంతవఱకుఁ బోరి యా రణరంగమున చచ్చిపోయినను బాగుగనుండెడిది. అట్లును జేయఁ జాల నైతిని.

కావున నీపైన నేను ప్రాయోపవేశ మొనర్చి ప్రాణత్యాగముచేయ నిశ్చయించితిని. మీరందఱును దమ్ముఁడగు దుశ్శాసనునిగూడి పురమునకుఁ బోవుఁడు. మిత్రులకు ప్రమోదమును శత్రులకు నిర్వేదమును గలిగించుచు నింతవఱకు బ్రతికినట్టి నేను, ఆగోప్యమంతయు చెడి శత్రువులచే దెబ్బతిని సిగ్గులేక మన బంధువర్గములోని కేమని యరుగుదును ? నా తండ్రినిగాంచి యేమని పలుకుదును? కురువృద్ధుల యెదుట

నిలిచి యేమని సంభాషింతును ? పౌరులు, పురోహితులు నన్నుజూచి యేమందురు ? ఇదంతయు నాత్మదోషముననైన యపరాధము. అనుభవింపక యెట్లుతీఱును ?

కర్ణా ! వినుము. దుర్వినయముగల మనుజుఁడు సంపూర్ణమైన సిరిసంపదలనందియు, గొప్ప విద్యను బడసియుఁ నారెంటివలనను మహానందమందుచు పరులకు వీలైనంత సహాయముచేయుచు నిశ్చింతగా బ్రతుకలేక లేనిపోని దుశ్చింతనములు చేయుచు జోలిమాలిన పనులకుబోవుచు ననవసరముగ పెత్తనములు నెత్తినిడికొనుచు, చివరకు పలు పాపపు పనులలోనికి దిగి భ్రష్టుఁడగును. నాగతియు బ్రస్తుత మీరీతి గనే యయ్యెను.

అన్నన్నా ! ఎంత మహాపదలోఁ బడవలసివచ్చెను. నన్నొక యూరుపేరులేనివాడు వచ్చి పట్టి బంధించుటయును, దయతో గర్భశత్రువులగు పాండవులు విడిపించుటయునా ? ఆహా ! దైవము నాకెంత వ్యతిరేకి యయ్యెను. నాపచ్చయాతని కెంత కిట్టకపోయెను ? నా మానమెల్ల చెడిపోయినది. ఇంక నే నీ మలినదేహముతోఁ బ్రాణములుదాల్చి యుండుట యసంభవము. కాన నేను బ్రాయోపవేశము చేసితీఱెదను. ఈ నా పూనిక నెవ్వరును నడ్డగింపవలదు.

తమ్ముడా ! దుశ్శాసనా ! నిన్ను రాజ్యమునకుఁ బట్టభద్రునిగఁ జేసెదను. నేటినుండి నీవే మహారాజవు. కర్ణుఁడు, శకుని మున్నగువారు నీకు దగిన సలహాల నొసంగుచుండ జగ

జ్జైగీయముగా ప్రజలను పాలింపుము. నాయనా! మనతమ్ముల
కెల్ల ప్రీతిచేయుము. బంధువులను బోషింపుము. బ్రాహ్మణోత్త
ములకిచ్చిన వృత్తులు చక్కగాఁ జెల్లనిమ్ము. మన గురుజనులను
భక్తితోఁ గొలువుము. పరమపవిత్రులైన శూరులను గొని
యాడుచు వారిని గౌరవించి వారిచ్చిన యుపదేశముల
ప్రకారము నడువుము. దేశము శత్రురహితముఁ జేసికొమ్ము.
నాయనా! నీకిదే కడసారిగా అన్న చెప్పు విన్నపము." అని
కన్నీరు ధారలై కార దుశ్శాసనుపైఁ బడి యేడ్చెను.

అంత నాతఁ డిదేమోకో యని యాతని పలుకులు
హృదయశూలంబులై బాధింప నిలువలేక యన్నగారి పాదము
లపైఁ బడి "అన్నా! అజ్ఞానతీయఁ దగునా? నాకుఁ బ్రిసన్నుఁ
డవు కావలెను. భూమి కంపమంది ముక్క ముక్కలగుగాక!
హిమవత్పర్వతము చలించుగాక! సముద్రములలోని జలమం
తయు నింకిపోవుగాక! సూర్యచంద్రులు తమ తమ కాంతు
లను విడుచుఁగాక! నీకిట్టి కుత్సితమైన యుద్దేశము పుట్టవ
చ్చునా? సర్వవిధముల నీవు పాలించుచున్న యీ భూమి
యొక్క బరువు నేను సహింపఁగలుగుదునా? అది యసంభ
వము. అగ్రజా! మనక్షేమముకోరి మనల నాశ్రయించి
జీవించుచు హితులను కాపాడుచు శత్రుబాధ లేకుండఁ జే
యుచు జయశీలుఁడవై నూఱేండ్లు నీవే యీభూమిని పాలింప
వలెఁగాని యాపని నాచే కానేరదు. దిగ్గజము వహింపవలసిన
భారము శునకము మోయసమకట్టునా? గొడ్డలిచేఁ జేయవల

సిన పని కోరి చేసగునా? కాదు. కావున నన్నయ్యా! ముక్కు పచ్చలారని మాబోంట్ల నాకుచాటు పిందేవలె నీవు పై నుండి కాపాడి పెంచి పెద్దవారి గావింపవలెంగాని నీవిట్టులధైర్య పడి యాత్మహత్యకుంగడంగిన మాకేమిగతి?" అని యేడ్చుచు నూరకుండెను అప్పుడు కర్ణుడు వారినుపురంగాంచి,

"ఓయీ! బాలిశులవలె వివేకవిహీనులవలెం మొఱ కులవలె, అజ్ఞులవలె కడివెడునీళ్ళ కేడ్చెదరేల? ధైర్యము వహింపుడు. రాఁగలదానిని బుద్ధిచే నివారింపవలెనుగాని యేడ్చిన నేమిప్రయోజనము? ఇట్లు కంటికి మంటికి నేకధారగా నేడ్చుచున్నచో మనలనుజూచి పగతుఱు సంతసింతురు. మఱియు దుఃఖించువారికి పై పై దుఃఖము లేవచ్చి మీఁద పడు చుండును. ఊరకుండుడు.

ఓ చంద్రవంశశిఖామణీ! దుర్యోధనా! ధైర్యవంతు డవగు నీవుగూడ నొక యల్పమనుజునివలె విచారింపఁ దగునటయ్యా? మహాసుకుమార ప్రకృతియగు నీశరీరమును విడుచుట కుత్సహింతువటయ్యా! ఇదెంత దారుణము? నిన్ను చూచిన మాకందఱకును మహాదుఃఖము గలుగుచున్నది. నీవు ధైర్యము తెచ్చుకొని మాకు ధైర్యము గలిగింపవలెగాని యేఁడువారివలె రోదనములా చేయవలసినది?

నీవు పాండవులచే విడిపింపఁ బడితినని గదా విచారించు చున్నావు? అది వట్టి పొరపాటు. దురభిమానగ్రస్తుఁడవై యిట్లు పలవరించుచున్నావుగాని కార్యగతి యెఱుఁగవు.

ఏమందువా ? వినుము. ఏ రాజు రాజ్యమున ప్రజలు నిర్విచా
రముగనుండి సుఖాతురో యట్టి జనులు ఆ రాజునకు బంట్లు
వంటివారు. వారి క్షేమమునకు రాజే గదా కారణము ? అట్టి
ప్రజలు రాజున కవసరము గలిగినప్పుడు తమ తమ శక్తుల విని
యోగించి తోడ్పడి తేని నుద్ధరింపవలెను అది వారల విధి.
అట్లు చేయనినాఁడా ప్రజ కృతఘ్నతా ఫలమంది తీఱును.
పాండవులు ప్రకృతము నీ దేశముననుండి నీ యాజ్ఞవలన
రక్షింపఁబడుచున్న భూమిలో సుఖజీవనము చేయుచున్నారు.
వారు నిజముగా నీ కింకరులు. నీ యవసరము తీర్చుట వారల
కర్తవ్యమైనపని. అట్లు తీర్చి వారి మానవత్వము వారు కాపాడు
కొన్నారు.

లేనినాఁడు వారిబుద్ధి పశుత్వమునఁబడునుగాని మానవత్వ
మెట్లగును ? దీఁకింత విచారింప నెందులకో నాకుఁ దెలియదు.
అదియుఁగాక పాండవులు మనకు జూదంబునాఁడే దాసాను
దాసులైరి. వారి సమస్త సంపదలును నీ యధీనములైనవి. నిజ
ముగా వారు నీ పాదసేవచేయుచు నీ యొద్ద నిన్నాశ్రయించి
యుండవలసినవారు. అట్టిది లేదాయె. నీమాత్రపు సహాయమైన
జేయవలదా ? ఇట్టివెల్ల నీవు బాగుగ నాలోచించి యనవ
సరమైన విచారముల నందక, వికటప్రయత్నము లొనర్పక,
లెమ్ము. పురమునకు నడువుము. నామాట వినుము. వినక
మూర్ఖత్వము పూనితివా, మేమందఱము నీతోడివారమే. నీ
మార్గమునే పట్టెదము. నీవు లోకులచే నగుబాటునందెదవు”

అని కర్ణుఁడు బోధింపగా వినియు దుర్యోధనుఁడు తన ప్రయత్నము మానఁడాయెను. అంత శకుని యాతని యవివేకము కనుఁగొని "రాజా! ఏమి నీ మూర్ఖత్వము? కర్ణుఁడు చెప్పిన మాటలు ధర్మయుక్తములు. వానిఁ వినుము, నా బుద్ధిబలము వినియోగించి నిష్కంటకముగఁ జేసి యీ భూరాజ్యమంతయును జూదమున సంపాదించి నీచేతిలోఁ బెట్టితిని. దానిని సుఖముగాఁ గుడిచి కూర్చుండఁ జాలక కూలఁదన్నుకొని పైఁగా శరీరమును విడిచెదను, యనుచున్నావు. నీకేమి వెఱ్ఱియా? పిచ్చియా? నరేశ్వరా! నీకు వృద్ధులసేవ లేకపోవుటవలన యిట్టులు నీబుద్ధి పెడదారి పట్టుచున్నది. కోపతాపములు దేహమున్న వారికెల్ల సంభవింపక మానవు. ధీరుఁడు వానిని తన నేర్పుచే నణఁచవలెను.

పిఱికితనమును, మఱపుఁదనమును, వక్రబుద్ధియు, మెత్తదనమును, తెలియఁజెప్పినను గ్రహింపకుండుటయు, విషయముల యందభిలాషయు గల రాజుకడ సిరి నిలువదు సుమా! నీ బుద్ధికితోఁచినదే వేదము కాదు. మా యభిప్రాయములను గూడ వినుము కార్యము నెఱిఁగి మెలఁగుట లెస్స.

ప్రాణాపాయమునుదీర్చి నిన్ను సురక్షితముగా కాపాడి పంపిన పాండవులు మహోపకారులు. వారియందు నీవు స్నేహము ప్రకటించుట ధర్మము. కాన వారికిఁ దగిన సత్కారముచేసి వారు సంతోషించునటులు చేయుట యుక్తముగాని చచ్చుటకు సిద్ధపడుట ధర్మమా? వీరులకు బలవన్మరణ

మొంత తప్పవని. చేసిన మహోపకారమును స్మరించి, నీ హృదయమందలి పాపచింతనమెల్ల తొలఁగించి, మహాతపశ్శక్తి సంపన్నులైన పాండవులను రక్షింపుము. వారి తండ్రి పాలు వారికి ధర్మయుక్తముగా పంచి యిమ్ము. దీని వలన నీ కమిత మైన కీర్తి దిక్కుల పిక్కటిల్లును. గొప్పపుణ్యము గలుగును. పెద్దలెల్లరు సంతసింతురు. దీన నీ కిహ పరములు గలవు. వారు నీకు తోడఁ బుట్టినవారు. మీరును వారును గలసి యీ రాజ్యము నేలుచుండగా బ్రహ్మరుద్రులైన మిమ్ము గన్నెత్తి చూడ నేరరు. నీకు సౌఖ్య గౌరవములు చేకూరును"

అని శకుని నుడువుచుండ దుర్యోధనుఁడు తన పాద సమీపమునఁ బడియున్న దుశ్శాసనుని గ్రుచ్చియెత్తి కర్ణ సౌబలులంజూచి "మీరేల నన్నిట్లు బాధించెదరు? నేనంత ధర్మములు తెలియనివాఁడఁగాను. ఇప్పుడు మీ యుపదేశము లతోఁ బనిలేదు. ఆ యుపదేశకాలము గతించినది. ధర్మమందుఁగాని, మైశ్వర్యమందుఁగాని, భోగములందుఁగాని నా కభిలాష లేదు. ఎన్నివిధములనైనను నా ప్రాయోపవేశంబు తప్పదు. నా పూనికకు మీరు విఘ్నము కలిగింపకుడు. మీ కిష్టముగల చోటులకుఁబొం" డని యూరకుండెను. వారలును మిగుల విచారించుచు దేవా! నీ విధ మిట్లుండి శత్రినట్లు పీడనన్న మే మేమనగలవారము? ఎక్కడఁ బోయెదము? మా కెవ్వరు దిక్కు? అనుచు నెవరి మందిరములకు వారేఁగిరి.

అంత సూర్యాస్తమయమయ్యెను. ప్రతీచీ ముఖ మూషా రాగముచే నెఱ్ఱబాఱెను. ఆకాశవీథులు కుంకుమ మొడఁబోసిన రీతిగ నుండెను. ఆ యెఱ్ఱఁదనము కాసారములమీఁదను నదులమీఁదను కొండకోనలలోను ప్రతిఫలించి రక్తనదులవలె ప్రకాశింపఁజేయుచుండెను. పక్షులెల్ల నిశ్చింతముగా రెక్కలల్లార్చుచు తమతమ గూండ్లను వెదకుకొనుచు నివాసములను జేరుచుండెను. పొలముకాఁపులు వ్యవసాయపుఁబనులను ముగించుకొని బుజములపై నాగళ్ళ నిడికొని యెద్దులను మరలించికొని స్వస్థానములు చేరుచుండిరి. పగలంతయు మేఁతమేసి నిండబాఱిన కడుపులతో నెమరువెట్టు నోరులతో, లేఁగలకై చేసిన హాదుగులతో నాలమందలు పల్లెలకుఁ దరలుచుండెను. గోపాలురు యేలపాటలుపాడుచు మహానందముతో గేదెలపై నెక్కి యేనుఁగులనెక్కిన మహారాజులవలె మందలవెంబడి తరలుచుండిరి. పల్లెలందలి పేరంట్రాండ్రు ప్రదోషసమయమని కాఁబోలు దీపకళికలనునిలిపి తులసమ్మలను బూజించుచు నమస్కరించు చున్నారు. నదులయొద్దనుఁజేరిన బాపలెల్లను సంగ వస్త్రములను దడిపికొని స్నానమాచరించి సంధ్యావందనమాచరించు గాయత్రిని జపించుచుండిరి. చీకటులు క్రమక్రమముగా ముదిరి లోకము నావరించుచుండెను.

అట్టిసమయమున దుర్యోధనుఁడును గరణీయములు నిర్వర్తించి వివిక్తదేశమునందు దర్భలను బఱచుకొని యందుఁ గూర్చుండి గాలిలేనిచోట కదలిక లేకయే వెలుగు దీపమువలె నింద్రియములు నిగ్రహించి ప్రాయోపవేశము చేసెను.

ఆ సమయమునఁ బూర్వము దేవేంద్రునిచే జయింపఁబడి పాతాళముననున్న రక్కసులు సుయోధను తెగువ నెఱిఁగి గురుడగు శుక్రుని వేఁడి యాతని ప్రభావముచేఁ గల్పింపఁబడిన కృత్యయను నొక శక్తిని బంపి దుర్యోధనుని ఉన్నవానిఁ నున్నట్లు పాతాళమునకుఁ దీసికొని రావలెనని పంపిరి. అదియు నా క్షణముననే చని యాతని మోసి ఘడియలో పాతాళము నకుఁ జేర్చెను.

దైత్యు లాతనిఁ గాంచి సంతసించి కౌఁగిలించుకొని యాతని కుశలమడిగి యిట్లనిరి. "అయ్యా! నీవు శూరశిఖా మణివి. భరతవంశమున నుద్భవించినవాఁడవు. ఇట్టి సాహస మేల చేయుచున్నావు? బలవంతపుఁ జావు మహాపాపకారణ మును నరకహేతువనియు నీ వెఱుఁగవా? లోకవిరుద్ధములై మూలఘాతములైన పనులందు నీవంటి బుద్ధిమంతుఁడు ప్రవర్తి ల్లునా? పురుషార్థములను జెడఁగొట్టు నీ దుర్వ్యవసాయము నుండి నీ విప్పుడీ ప్రూసిక మానుము ధైర్యస్థైర్యము లవలం బింపుము. శత్రువులను జయించి యేకచ్ఛత్రాధిపత్యము సేయుము. నీవు మనుజమాత్రుండ వనుకొనుచున్నావా? నీ పూర్వజన్మప్రకారము చెప్పుచున్నాము వినుము.

పూర్వజన్మమున మేమందఱము మాకు రాజు కావలెనని పరమేశ్వరుఁగూర్చి తపస్సుచేసితిమి. అతఁడు మా ప్రార్థన మంగీకరించి మాకు నిన్నొసగినాఁడు. నీ పూర్వదేహము వజ్ర శిలలతోఁ జేయఁబడినది. నీశరీరమును అస్త్రములుగాని, శస్త్ర

ములుగాని ఛేదింపనేఱవు. ఎట్టి చీకుచింతలు లేనిది. వజ్రమయ మయ్యును పుష్పకోమలము. సకలలోక సుందరులచేతను ప్రేమింపఁదగినంత యందచందములు గలది. అట్లు నీవు భూమిని బుట్టుటతోడనే నీకు సహాయము చేయవలెనని మా రక్కసు లెల్ల రాజకులములందు బుట్టిరి. వారే భగదత్తాదులు. భీష్మ ద్రోణాదులుగూడ మనతోడి స్నేహముచే మనగుణములే గల వారై సమరమున పాండవపక్షక్షయము గావింతురు. పాండవులు నిశ్శేషముగా నీచేఁ జావఁగలరు. అర్జునునివలన భయము నీకున్నదిగాని వానిని కర్ణుఁడు చంపివేయును. కృష్ణునిచేఁ జంప బడిన నరకాసురు నంశము కర్ణునిలోఁ జేరినది. కాన నతఁడు వారిరువురను కడతేర్పఁగలఁడు.

మరియు సంశప్తకులను పేరిట శతసహస్రసంఖ్యల వారు పుట్టిరి. వారిచేతిలో నర్జునుఁడు తప్పక చిక్కుకొనును. భూమి యంతయు నీవశమగును. మమ్ముద్ధరింపఁబుట్టిన నీవిట్లు ప్రాయోపవేశముచేసి చచ్చుట ధర్మముకాదు. నీ వెట్టి విషాదమును బొందనవసరము లేదు. జయము నీకుఁ దప్పదు."

అని వచింపఁగా దానికి సుయోధనుఁ డబ్బురమంది అదంతయు స్వప్నవిలాసమని యెంచక దురాశయముచేఁ దప్పక తనకు విజయమే చేకూఱు ననుకొని తన ప్రాయోపవేశము మానుకొనెను. పిదప తెల్లవాఱుతోడనే రాధేయుఁడు దుర్యోధనుని పాలికి చనుదెంచి "దుర్యోధనమహారాజా! నీవిట్టి చావున కట్టులు సాపుచున్నావుగదా! చచ్చిన తఱువాత

శత్రువులను జయింపఁగవచ్చునా? చావు శుభకరమా? ఎవ్వ రైన మెచ్చునట్టి పనియా? "జీవన్ భద్రాణి పశ్యతి" అనిగదా యార్యోక్తి. విజయార్థసుఖములు బ్రతికియున్నచోఁ గలవు గాని చచ్చిన నేమిగలదు ? కావున నిది శోకదైన్యములందు టకుఁ గాలము కానేరదు లెమ్ము. నీ పరాక్రమము చూపు మని యాతని లేవనెత్తుచు నీ కా యర్జునునివలన భయము మిక్కుటమైనది. వానిని నేను తప్పక యుద్ధరణములో జయిం చి తీరెదను. ఇంకను సందేహము లేదు. ఇదిగో కత్తినిబట్టి ప్రమాణము చేయుచున్నాను. నామాట నమ్ముము" అని పలు కగా ఆ మాటయుఁ దాను రాత్రి కన్న కల కనుపడగా దుర్యోధనుఁడు సంతసించి లేచి తిరిగి తన సైన్యములనుగూడి కొని కర్ణసౌబల సమేతుఁడై దుశ్శాసనాద్యనుజ గణంబులును దక్కిన యమాత్యగణంబులును గొలువ పట్టణాభిముఖుఁడై కతిపయప్రయాణంబుల కరిపురముచేరి సముచితవ్యాపారముల నుండెను.

చూచితిరా! దుస్సహవాస మెంతపని చేసినదో ? లేనిపోని తప్పత్రోవలఁ బట్టించి, పాపపుఁబను లొనరింపఁజేసి తుదకు ప్రాణాంతకమువఱకుఁ దెచ్చినది. కావున దుస్సహవా సము మానుకొనుటయు, దురాలోచనములు చేయకుండుటయు జనులకు ముఖ్యకర్తవ్యములు.



# మ ణి మా ల



## కాలకవృక్షీయుఁడు

పూర్వము పాడిపంటలతోడను, సిరుసంపదలతోడను దులతూఁగుచుఁ గోసలయను దేశముండెడిది. దానిని క్షేమదర్శియను రాజు పాలించుచుండెను. అతఁడు పేరునకే రాజు గాక ప్రజలను రంజింపఁజేయుటచేతను, లోకుల క్షేమమే తన క్షేమమని భావింటచేతను, సార్థకనాముఁడై విరాజిల్లుచుండెను. అతఁడు సమస్త సద్గుణములకు నాకరమై మిగుల శాంతచిత్తుఁడై, యెట్టి యన్యాయములను జరుగనీకుండ దనరాజ్యము పాలించుచుండెను. అధికారగర్వము గాని, యన్యాయార్జనముగాని,దుష్టరక్షణముగాని, శిష్టశిక్షణముగాని యాతఁ డెన్నఁడును జేసియెఱుఁగడు. ఎట్టివిషయములనైనను తాను స్వయముగాఁ జూచుకొనుచు నందలి సత్యాసత్యములు తెలిసి ధర్మనిర్ణయము చేసికొనుటేగాని చెవులను నమ్మి కన్నులను మూసికొనువాఁడు మాత్రముకాఁడు. చిరకాల మాతని పరిపాలనా వ్యాపారము జగజ్జేగీయముగా సాఁగిపోయెను.

రాను రానాతని యాస్థానమున దుర్మంత్రులకుఁ బ్రవేశము గలిగెను. మంత్రులు దుష్టస్వభావులగుటతోడనే మిగి

లిన యధికారవర్గమంతయుఁ దప్పుదారిపట్టఁజొచ్చెను. వారిలో వారల కభిప్రాయభేదము లుప్పతిల్లి తలకొకరీతిగా నడువఁ జొచ్చిరి. చివర కాస్థానమే కాక దేశమంతయుఁ గప్పల తక్కెడ యయ్యెను. కొందఱు ప్రజలొక యధికారిని, వేఱొక కొంద ఱొక యుద్యోగిని బట్టుకొని తమ కార్యముల నెఱవేర్చి కొనుచుఁ బరస్పర కలహాశీలురైరి. మంత్రులందఱును దమ తమ స్వార్థములను విడువక స్వోదరైక పరాయణులై పాప మనక పుణ్యమనక యెట్టి యధర్మములైన నాచరించు చుండిరి. "యథా రాజా తథా ప్రజా" అన్నటులు రాజాధికారులే తప్పుడు దారులు పట్టినప్పు డమాయికప్రజ దాని ద్రొక్కకుండునా ? నాఁనాఁటికి రాష్ట్రమంతయు ముప్పులపాలై, జార చోరభయ ములతోడను, పరస్పర కలహములు హత్యలతోడను, నల్ల కల్లోలమయ్యెను. ప్రజలలో నసంతృప్తి వాటిల్లిన నాఁడా రాజ్య మభివృద్ధిఁ గాంచుట మిగుల దుర్భరముగదా !

రాజెంత ధర్మతత్పరుఁడైనను తన్నియములు పాపమా ర్గము పట్టినప్పుఁ డాతఁడేమిచేయును ? అంతదనుక ధర్మాత్ము డని పేరుగాంచి దశదిశలు మ్రోగిన యాతనికా కులమున కెనలేని యప్రతిష్ఠ వచ్చిపడుచుండెను. పాపము, రాజు సాధ్య మైనంతలో దుర్మంత్రుల మత్రాంగములను వినీవిననట్లును, చూచీచూడనట్లును ద్రోసిపుచ్చుచున్నను ప్రజాక్షోభము పెరిగిపోయి రాజు హృదయమును గలఁచివైచెను. అప్పుడు ప్రజలు కొందఱు "మంత్రులు స్వార్థపరులును, లంచగొండు

లును, అధికారవాంఛగలవారు నైనందున రాష్ట్రమునకీగతి పట్టినది రాజునకైనను మేలుకొనవలదా? దేశము సర్వనాశన మగుచుండఁ దన్నుగానటు లూరకుండుట ధర్మమా! సుభిక్ష మగు దేశ మింతటి దుర్భిక్షముతో కుములుచుండ నా యాప దనుండి ధర్మతత్పరుఁడగు రాజు తప్పింపవలదా? ఇది రాజుపే క్షించుటవలననే గలిగినదనుచుండిరి.

మఱికొందఱు ప్రభువు సమ్మతింపనినాఁ డిట్టి దారుణ ములు జరుగ వీలున్నదా? అతఁడు జాఱుముడిగనుండి స్వార్థ పరులైన మంత్రులతో నేకీభవించి యుండవచ్చును లేనినాఁడు నిమిషములో నీ దుష్టుల నవ్వలకు నెట్టింపలేఁడా" అని యను కొనుచుండిరి.

వేఱొక కొందఱు "అతఁడు ముసలివాఁడైనవాఁడు ఎంత కాలమని యాతఁడు బాధపడఁగలఁడు. ధర్మాధర్మ నిర్ణయము లొనర్ప నాతనికెట్టిశక్తియు లేదు. అతని నొక ముసలమ్మనువలె గట్టిపెట్టి బలముగల యధికారులు వారి యధికారములను దుర్వినియోగ మొనర్చుచున్నారు. వారిని మందలింప లేఁడు అసమర్థుఁడు" అని యనుకొనుచుండిరి.

"పరిపాలనా విధానమంతయు దుర్మంత్రుల యధీనముచేసి తాను నామమాత్రుఁడై యున్నాఁడు. ఎట్టివానినైన గడ్డి గఱపించునది ధనము. దానికై కక్కుఱితి లేనివాఁ డెవడు? అతఁడు మోమోటముచే తప్పించుకొని తిరుగుచున్నాఁడు. ఎవ రెట్టి పనులొనరించినను రాజు తటస్థుఁడగుటచే నిట్టి ముప్పు గలిగిన"దని కొంద ఱనుకొనిరి.

"దుష్టులను శిక్షించుటకు దుర్మార్గమునే ప్రయోగింప వలెనుగాని ధర్మమచట పనికిరాదు. తాను కటకుగానున్నచో నధికారుల యాటలు సాగునా ? తన స్వాతంత్ర్యమును చంపి కొని, తన యధికార మణచికొని, తనశక్తి తాను మఱచి నిర్లిప్తతతో నున్నప్పుడిట్టి యిక్కట్టులు రాకుండునా?" అని మఱికొందరు తలఁచుచుండిరి.

ఇట్లు గుంపులు గుంపులుగా గూడి ప్రజలు వివిధము లైన ప్రవాదములు గల్పించుకొనుచు, కుతర్కము లొనర్చు కొనుచు, కలహశీలురై ప్రభుత్వ విమర్శలతోడనే తమ కాల మంతయు వెడలఁబుచ్చుచుండిరి.

కోసలదేశమునకు సమీపమందే యొక చిట్టడవి గలదు. అందొక పర్వతముండెను. అందు గొందఱు మునిసంతతిలోని వారు తపమొనరించుకొనుచు మహాప్రభావ సంపన్నులై లోకవాసన విడిచి మోక్షమును గోరువారై యుండిరి. రాజ పురోహితుల వంశములోని వారుగూడ నందుండిరి. తాతముత్తా తలనాఁటినుండియుఁ బాలించిన రాజుల ప్రవర్తనముల నెఱిఁ గినవారును, క్షేమదర్శియొక్క యోగ్యత నెఱిఁగినవారును గూడ నుండిరి. వారిలో లోకోద్ధరణమందు వాంఛగలిగియు, రాజున కిప్పుడు గలిగిన యపకీర్తి తొలఁగించు నూహయుఁ బొడమిన కాలకవృక్షీయుఁడను నొక బాపఁడు తోడి మహర్షు లతో "ఆర్యులారా ! క్షేమదర్శిసంగతి మనము చిరకాలము నుండి తెలిసినవారమే. కాని కొందఱు దుర్మంత్రులవలన

ప్రకృతము రాజ్యము సర్వనాశనము కానున్నది. వర్ణసంక రము పెచ్చుపెఱుఁగుటయేగాక ధర్మము కృశించి పాపము మిక్కుటమగుచున్నది. ఘోరహత్యలు, చౌర్యములు, కలహ ములు పెచ్చుపెఱిఁగిపోయినవి. మనమెప్పుడైనను "ప్రజలకు స్వస్తియగుగాక. రాజు న్యాయమార్గమునఁ బాలించుఁగాక. గోవులకును, బ్రాహ్మణులకును సుఖమగుగాక. పిమ్మట సమస్తజనమును సుఖింతురుగాక" అని కోరుచున్నాము. కోరుటయేగాక మన మంత్రశక్తిచే సమస్తదేశక్షే మము నపే క్షించుచున్నాము. మన మనుకొనకున్నను మన జపశక్తివలన రాజు కాపాడఁదగినవాఁడు. మనమొకమూల ముక్కుమూసి కొని కూర్చున్నచో దేశము పాపాత్ముల యధీనమగుచుండ బిమ్మట మనము చేయునదేమి? ఎందులకీ తపములు? ఎందు లకీ మహిమలు? కావున నేనుబోయి రాజును గలిసి యాతని కుపదేశింపవలసిన నీతులు కొన్ని కఱపి' దుర్జన బహిష్కరణ మును, సుజనావలంబనమును గలిగించి ధర్మరక్షచేయ సమ నసుకట్టితిని. మీమీ యభిమతములఁ దెలుపుఁడనెను. అంత మునులందఱును ప్రజల క్షేమమును, రాజక్షేమమును దమ విగా భావించుచు "నాయనా! దప్పక పొమ్ము. మనము మన జీవితమెల్ల ధర్మముల బోధించియో, శాస్త్రముల రచించి యో, కర్మముల నాచరింపయో, శ్రుతిస్మృతి పురాణములను దేటతెల్లమగునట్లు పరివర్తించియో లోకముకొసమే గడుపు చున్నాముగదా! ఇట్టిపట్టులందుగూడ రాజును బాగొనర్చి

రాజ్యము నీకుఁ పుట్టి వీలైనంతవఱకు చేయవసినదే. నీకీవిష యమున విజయము చేకూరుగాక ! మనకీ కార్యమందెట్టి స్వా ర్థాభిలాషయు లేదు. శుభము వెడలుము" అని దీవించి యాతని బంపిరి.

వెంటనే కాలకవృత్తీయుఁడు పంజరమందొక కాకిని బెట్టుకొని క్షేమదర్శియుండు కోసలకువచ్చి వీథులవెంబడి దిరు గుచు "మనుజులయొక్క సర్వసంకల్పములను, భూత భవిష్య ద్వర్తమానములనుగూడ నే నీ కాకి సాహాయ్యమునఁ జెప్పఁ గలను. నేను గొప్ప జ్యోతిష్కుఁడను. ఈ వాయసము సర్వ ము దెలిసినది." అని యొక వ్రకటన గావించెను.

ఆతని రూపురేకలును, కాకితోఁగూడిన పంజరమును, ఆతడు వచించు సంగతులును, చూచుచు వినుచు ప్రజలంద అును నాతని జుట్టిముట్టి వెంబడించు చుండిరి. ఎందఱెందఱో "జోస్యము చెప్పుడు. చేతులుచూచి చెప్పుడు. జాతకముల బరిశీలింపుడు" అని యడుగుచుఁ బలురీతుల బ్రశ్నించుచు నాతనివలన సత్యము దెలియుచుండిరి. జరిగినవికొన్ని యాతఁ డు నిజముగఁ జెప్పుచుండ ప్రజలెల్ల రాతని మహామహిమ కలవానిగ నెన్నిరి. ప్రశ్నలను జెప్పుటకు ముందాతఁడాకాకి తో నేదో భాషలో మాటాడి పలుకుచుండుటచే నాకాకియు మహిమగలదని జనులు భావించిరి. క్రమక్రమముగా సందడి వీథులు, రాజవీథులు, అధికారులభవనములు, అంతఃపురములు నాతఁడు చొచ్చి "ప్రశ్నభాగమం దింతవాఁడులేడు. ఈతఁడు సర్వజ్ఞుఁడు" అను ప్రఖ్యాతి సంపాదించెను.

ఈసంగతి యానోటనుండి యానోటఁబడి క్రమముగా హేమదర్శి చెవిఁబడెను. ఇట్టి మహామహులని దర్శించితీరవలెను. ఆతఁ డెంతప్రజ్ఞగలవాఁడో! లేకున్న నిందఱ హృదయముల నాకర్షింపఁగలఁడా?" అను వాంఛయు తేఁనికిగలిగెను. తోడనే యాతఁడు దగినవారిని పంపి యాతనిని దన కడకు రప్పించెను.

కాలకవృక్షీయుండును, సహజమైన మునివేషము, విశాలనేత్రములు, ఫాలము, బ్రహ్మవర్చస్సుగలశరీరము, దివ్యమైన వాక్కులును నొప్ప మంత్రులతోడను, సామంతులతోడను, అధికారులు అనధికారులు ప్రజలతోడను రాజు మహాసభ తీర్చియుండ నా సదస్సు నాతఁడు వాయసపంజరముతోఁ బ్రవేశించెను. అడుగు పెట్టుతోఁడనే యాతఁడు రాజును దీవించి నమస్కార మొందికొనెను. సభలోనివారెల్లరును లేచి యాతనికి వందనము లాచరించిరి. వారి వందనము లందుకొని యాతఁడు తన దృష్టిచేతను, చేయూపుచేతను వారినెల్ల వారివారి స్థానములఁ గూర్చుండఁజేసి తనకు నియమింపబడిన వేత్రాసనమున రాజానుమతుఁడై కూర్చుండి రాజువైపు తిరిగి యిట్లనెను. "మహారాజా! యీ వాయసము నాకు త్రికాలవృత్తాంతముల నెఱిఁగించును. దీనికి జన్మాంతర సంస్కారమువలన నట్టి శక్తి యలవడినది. ఎట్టి రహస్యము నైన దీని సహాయమున తేటతెల్లముగా నేను వచింతును. నీ వడుగక యే యిప్పుడొక సంగతి నీకు బోధింపుమని చెప్పుచున్నది. ప్రభువుల సెలవైనచోఁ జెప్పెదను."

అది విని రాజు తప్పక వచింపుఁడు. తమ ప్రజ్ఞ కాంచ వలెననియే మిమ్ముల నిటకుఁ రప్పించితిని. నిస్సంశయముగాఁ జెప్పుఁడనెను. అంత కాలకవృత్తియుఁ డాసనమునుండి లేచి "యీచెప్పఁబోవు గొప్పవిషయము నామాటకాదు. ఈవాయసము చెప్పుమన్న సంగతి. "రాజా! తమ సన్నిధానముననున్న మంత్రులెల్లరును తమకోశసంపదను హరించువారుగా నున్నారు. ప్రభువున కెనలేని యపకీర్తి తెచ్చిపెట్టుచున్నారు" అని యీ కాకము వచించుచున్నది. దీని వచన మింతవఱకుదబ్బరకాలేదు" అని యూరకుండెను. రాజా మాటలువిని నివ్వెఱపడి యిట్లనుకొనెను. "అయ్యయో! ఈ మంత్రులెల్లఁ బయోముఖ విషకుంభములవలె నుండి నన్ను వంచించుచున్నారు కాబోలును. వార్ధకదోషమువలన నేను గొంత తటస్థుఁడనగుట నాకొంప మునిఁగినది. ఇట్లు జరుగుచున్నచోఁ దుదకు వీరు నా రాజ్యమునుగూడ మ్రింగివేయకుందురా? ఇంకను లోలోన నెన్నిమాయలు, మర్మములు జరుగుచున్నవో? ఎన్ని కుంభకోణములు చేయుచున్నారో? ఈ మహర్షివలన దెలియవలెను" అనుకొని "ఆర్యా! తమ్ము మఱికొన్ని రహస్య విషయము లడిగి తెలియవలసి యున్నది. రేపు తమతో సంభాషింతును. అంతదనుక తమకొక దివ్యభవనములో వసతి నేర్పఱచితిని. అందుండుఁడు. నాపని తీఱినవెనుక తాము వెడలుదురుగాని." అని చెప్పి నాఁటికి సభ చాలించెను.

మంత్రు లందఱును బ్రాహ్మణుఁడు నిండుసభలోఁ తమ్ముఁ గూర్చి వచించిన మాటలకు మిగుల తాపమంది "రాజు రేపు వీనితోఁ దప్పక మనలను గుఱించి గట్టుమట్టు లడిగి తీఱును. ఈతఁడు వాయససమూహమున మన లోఁతు పాఁతు లన్నియు నున్నవున్నటులు వచింపఁగలఁడు. పిమ్మట మనకందఱకు ననర్థము వాటిల్లును. కాన నీ రాత్రి మెల్లఁగ సేవకులచే నీ కాకిని జంపింపవలెను. లేకున్న మన మర్యాదలు దక్కుట కష్టము" అని ఆలోచించి యొక తెగువరియగు బంటునుబిలిచి వానికి వలసినంత విత్తము లంచమునిడి యా రాత్రి వాయసమును జంపించివైచి యేమి యెఱుఁగనట్లుండిరి.

తెల్లవాఱగానే కాలకవృక్షీయుఁ డనుకొన్న పని సక్రమముగా జరిగినందులకు సంతసించుచు, ఆ యానందమును పైకి తెలియనీయకుండ కాలకృత్యములు దీర్చికొని ప్రభువును దరిసింప సిద్ధముగ నుండెను. రాజభృత్యుఁడును జేరి "రాజాజ్ఞయైనది. దయచేయుఁడు" అని చెప్ప వాని వెంబడినే యాతఁడు ప్రభువును దర్శించి యాచారము నిర్వర్తించెను. పిమ్మట "రాజా! ఇప్పుడు మున్ముందుగా నీవు నా కభయమీయవలయును. రాజుకడనున్న జను లెంతటి ఘోరములనైనఁ జేయఁగలరు. వారికి పాపపుణ్యములతోఁ బని లేదు. స్వార్థసిద్ధియే వారల లక్ష్యము. దానికై యెట్టివారినైనను వారు బలిపెట్టఁగలరు. అధికారముద్రను దుర్వినియోగ మొనర్చుటలో వారారితేఱినవారు. నీ యాజ్ఞయైనచో బరమరహస్యము లెన్నో

యున్నవి. చెప్పెదను" అనెను. అందులకు రాజు "నీకు వచ్చిన భయ క్షేమియు లేదు. నిర్భయముగా వచింపవచ్చును. నీ వలన నాసంగతుల నెవ్వడు వింనునో యను నాతురతయు నాకుఁ గలదు. ఎట్టి గుట్టులనైనను మట్టుపెట్టక నీవు నిరాతంకముగా వచింపవచ్చును" అని సెలవిచ్చెను. అంత బ్రాహ్మణుఁడును యిట్లు చెప్పఁదొడఁగెను.

ప్రభువా! రాజసేవ మిగుల కష్టతరమైనది. ఎట్టివారికైన నది యెప్పటికో యొకప్పటికి విషమించి తీఱును. కత్తి పదనుచు నాలుకతో నొక్కి నాకుట యెంతసుఖమో, నోరు తెఱచికొని మ్రింగుటకు మీఁదికివచ్చు సింగమును కౌఁగిలించికొనుట యెంతసుఖమో, నల్లత్రాఁచుఁబాము మోమును ముద్దిడుకొనుట యెట్టిదో, మిమ్ములను సేవించుటయు నట్టిదే. ప్రభువులకు యెల్లప్పుడును మిత్రవర్గమును శత్రువర్గముగూఁడ నుండును. రాజు ననుసరించి జీవించునట్టి వాఁడాందఱి యెడల ననుకూలముగా సంచరించుచుండవలెను. బ్రతుకదలఁచిన వాఁడు రాజాశ్రయమును విడిచి స్వతంత్రుఁడై యుండవలెను. లేదా నిద్రలోనైనను దాను రాజసేవకుఁడననుమాట మఱువరాదు. ప్రమాదము చెందియుండెనో, ప్రాణముల మీఁదికి వచ్చినటులే. ప్రమాదము తప్పుపనులు చేయించును. దాని వలన బుద్ధి కస్థిరత యేర్పడును. దానివలన నెంతవాఁడైనను నశింపక తప్పదు. మండుచున్న నిప్పుకడ కేఁగుట కెంత నేర్పుండవలెనో, విషసర్పము ముందు నిలుచుట కెంత జాగరూకుఁడై

యుండవలెనో, రాజుకడ నివసించువాని కింత మెలఁకువ యుండవలెను. తాను చేయునదిగాని, తాను పలుకునది, తాను కాంచునదిగాని రాజునకు వ్యతిరేకమైనది కాదుగదా యని రాజసేవకుఁ డెప్పుడును వణకుచుండును. వారు ఆశ్రితుఁడు దగ్గరనుండి మాటాడినచో ఏమి టింకమీఁదికి వచ్చుచుంటి వందురు. కొద్దిదూరమునుండ "ఏమా నిర్లక్ష్య" మందురు. కొంచెము వినయ విధేయతలతో మెల్లఁగా పలుక "ఏమా నంగి నంగిమాట" లందురు. ఊరకుండిన "మూఁగివాఁడవా యేమి?" యందురు. విషయము విన్నవించుచో "నేమి యీ లొడలొడ" యని విసువు చెందుదురు. ఎట్లున్నను యెల్లాడి నను మొండివానికడ ముక్కు గోకికొన భయమన్నటులు ప్రభువులకు చిరాకుగలుగును. రాజు దయదలచినచో సకలార్థములను జేకూర్చును. అతని కోపమునకు గురియైతిమో దవాగ్ని శుష్కవిపినమునువలె సమూలముగా దహన మొనర్చును. కాన నాశ్రితుఁడు రాజువలనను, మిత్ర శత్రువర్గము వలనను గూడ నప్రమాదుఁడై యుండవలెను. చూడుము, నిన్న నేను సభలో నా వాయసప్రభావమును జాటితిని. మచ్చున కొక్క విషయము నీకుఁ జెప్పితిని. రాత్రి యేమి కుమ్మక్కు జరిగినదో తెలియదు. నా వాయసము చచ్చి పడియున్నది. ఇది యెవ్వరి పనియో చెప్పకయే తెలియుచున్నది. ఐనను నేను వారి నెవ్వరిని నిందింపఁబూనను. కాని నీవు నీ హితులను అహితులను నేర్పున నెఱిఁగి సంచరింపవలెను. నీ కన్నులతో

గాంచిన విషయమును నమ్మ్రముగాని చెవులఁబడిన నుడులను నమ్మరాదు. రాజా! నేను మొదట నీ హితము కోరి వచ్చి నిజము పలికినంతనే నిష్ఠుర మెంతజరిగినదో తెలియును. ఈ కాకము నీ మంత్రులచేతనే వధింపఁబడినది. ఇంక నేనును నీ దిన మిట నుంటినా, నాపనియు నిట్టిదే యగును. అనేక క్రూర జంతువులచే నిండి నిబిడీకృతమైన యడవి దాఁటుట యెట్టిదో నే నీ రాజదుర్గమును దాఁటుట యట్టిది. ఇట నాఁబోటి సత్య వాదికి తావు లేదు,

రాజా! సత్యము పలుకుచున్నాను వినుము. కాకియు లేదు. త్రికాలములను వచించుటయు లేదు. నేను నీ పురో హిత వంశములోనివాఁడను. ప్రస్తుతము నీ రాజ్య మంధకార బంధురమైనది. నీవు పూర్వ మెంతకీర్తి సంపాదించితివో యంత యప్రతిష్ఠకు గుఱియైతివి. దీనికి నీ మంత్రులే కారణము. నీ వెంత ధర్మాత్ముఁడవైన నేమి? దుర్మంత్రుల సంపర్కముచే నీవు విషముగలిసిన భోజనమువలె నైతివి. పాములతోనిండిన బావి నెవ్వ రుపయోగింతురు ? జలము నిర్మలమైనదే. కాని పసరెక్కినది. దానిని కాకులైన త్రాగనొల్లవు. నీవును నట్టులే యైతివి. ఒక మహావృక్షమును జుట్టుకొని యాపరించి వృద్ధి పొందిన లత చివఱకు దావాగ్నిచే సులువుగా దగ్ధమగుచుఁ దాను తన కాశ్రయమగు మహీరుహామునుగూడ కాల్చి చంపునటులు నీ మంత్రులు, మిత్రులు, అధికారులును రాజ

ద్రోహ పరాయణులై యీ పాతకమున నశించుచు నిన్నుఁ గూడ కూల్చుచున్నారు.

మిగుల జ్ఞాపకము కలవాఁడును పౌరులకును జానపదులకు నాప్తుఁడును, సమస్త కార్యతంత్రము లెఱిఁగిన యతఁడును ధైర్యము, శౌర్యము మున్నగు గుణములు కలవాఁడును, క్రౌర్య మెఱుఁగనివాఁడును, పవిత్రమైన యంతఃకరణ కలవాఁడును, రాజభక్తి పరాయణుఁడును, సుఖదుఃఖములను తుల్యముగ గాంచువాఁడును, తప్పు తనపై మోపినను గోపింపక, మెట్టి కలతయు జెందక, స్నేహభావము, కలసికట్టుతనము గలవాఁడును, తన తప్పులు దాఁచికొని పరరంధ్రములను వెదుకనివాఁడును, ప్రజాపక్షపాతియు నగు విశాల బుద్ధి మంత్రిగా నుండవలయును.

ఈ గుణములకు నీమంత్రులు మిగుల దవ్వుగా నున్నారు. కావుననే దేశమందు నేఁ డింతక్షామ పుట్టినది. ప్రజలలో ద్వేష ముదయించిననాఁడు రాజు చేయవలసిన దేమియు లేదు. ప్రజాబలమునకు మించినబల మే యాయుధములకు, నే సైన్యములకును లేదు. మొదట నీయొద్ద చేరి నీవలనఁ బేరు పెంపు లందిన నీ మంత్రులు నేఁడు నీ హితమును నీ ప్రతిష్ఠను గోరక నిన్ను క్షీణింపఁ జేయ నెంచుచున్నారు. ఆ కృతఘ్నుల చేష్టలు నీవు గుర్తింపకుంటివి. నీ రాష్ట్రమున జరిగెడు నధర్మములును నీకు దుర్మంత్రులవలనఁ గలుగు నపాయమును మే మెఱిఁగితిమి. నీకు క్షేమ ముపదేశింప నెంచి యీ కాకియును

మిషచే నిన్ను చేరగలిగితిని. రాజ కార్యములయట్ల వ్యవహార బుద్ధి గలిగియుండవలెను. ఎన్నడును ప్రజలకు వ్యతిరేకముగ గాని, వారల కష్టకార్యము చేయుచుగాని యుండరాదు. ఇది మీగుల ధర్మమును జేకూర్చును. కీర్తిని పెంపొందించును. మహామంత్రవేత్తలు ధర్మతత్పరులగు వారితో గలిసి ప్రజల కార్యాలోచనములందు నిష్పక్షపాతముగ వర్తింప వలెను. ఏదోయొక పక్షమును నవలంబించి 'యహామస్మి' యనుట తగదు. వాఁడు ధనికుఁడు. వానిపక్షము పలుకుకున్న మేలు లే దనిగాని, వీఁడు బీద, వీనివైపు విడిచినను ప్రమాదము లేదని గాని రాఁ జెన్నడును వర్తింపరాదు. దండింపఁదగువారి నపరా ధమును క్షమించక శిక్షింపుచుండవలెను. నీవొక పక్షపాతము చూపితివేని జేగనుగన్న పులుఁగులగుంపువలెఁ బ్రజ నిలువక చెదరిపోవును. కాన నీవు నిజాగ్రత్తలో నుండుము.

మొదట నీకు నేను హితము బోధింపవచ్చితి నను కారణముచేతనే వారు నాపై కత్తికట్టిరి. నాయందు వారికి కోపము గలుగుట కింకొక హేతు వేమియులేదు. వారలకు నే నెట్టి ద్రోహమును జేసి యెఱుఁగను. నీకుఁ నేను జేయవ లసిన హితవే వారికి ద్రోహముగాఁ బరిణమించినది. రాజా! నీ తండ్రికిని నా తండ్రికిని గల స్నేహభావముచే నీ కీ హిత ముపదేశింప వచ్చితిని. నీ కిప్పుడు గలిగిన ప్రమాదము, నీ రాజ్యమునకుఁ గలుగఁ బోవు ముప్పు గూడఁ బ్రజలవలన నెన్నోసారులు విని పూర్వ సంబంధమునుబట్టి తటస్థుఁడను

కాలేక యొక నెపమున వచ్చితిని. నా పేరు కాలకవృష్టి యుఁడు. నాకిఁక సెలవిమ్ము. నన్ని రాష్ట్రము దాఁటిపోనిమ్ము. అంతవఱకు నాకు నీవు సాయ మిమ్ము. లేనిచో నిర్బాధక మగు నీటిపామును విషసర్పమనుకొని పలువురు మొనగాండ్రు కఱ్ఱలను బూని చంప నలుదిక్కులు కాచికొనినట్లు నాపని పట్టుటకై నీ మంత్రు లీపాటి కెన్నియో కుతంత్రములు పన్ని యే యుందురు. నే నిఁక నిచట నిముసము నిలువరాదు" అని లేచి పోఁబోవుచుండ రాజును,

"స్వామీ! తా మెవ్వరో తెలియఁబలికితిరి. నన్నుద్ధరింప వేంచేసితిరి. నా లోపములను నిస్సంకోచముగఁ దెలిపితిరి. ఇంతకన్న నాకు వలసిన దేమున్నది? నామంత్రుల దుర్వృత్తము నాకింతకుఁ బూర్వమే శ్రవణగోచరమైనది. కాని నేను ముఖ్యకార్యముల నిర్ణయము విషయమున నొంటరినై పట్టుఁగొమ్మ లేని వాఁడ నైతిని. వారి ప్రాబల్యము హెచ్చినది. నన్ను వారు తమపక్ష బలముచే నోడించుచున్నారు. గారుడమంత్రమునకుఁ గదల మెదల శక్తి లేని నాగుఁబాము వలె నా శక్తియు సన్నగిల్లిపోయినది. తమరు నా పాలిటి దైవము వలె వచ్చి హితబోధ మొనర్చితిరి. తమ మంత్రకౌశలము నాకు సంతోషదాయకమైనది. అంగములలో నొకయంగము దూషితమైనపుడు దానిని తెగనఱికి శేషాంగరక్షణ గావించికొనుట మేలుగదా! ఇప్పుడు నా మంత్రులనెల్లఁ దొలఁగించి వైచెదను. నీ వొక్కరుఁడవే యాస్థానమున నిలిచి నా రాజ్య

మును ప్రజలను నన్నును గూడఁ జక్కదిద్దుము. ప్రజాహితము వడయని ప్రభువు జీవన్మృతుఁడు కాఁడా? నా కోరిక చెల్లింపుఁడు. నాకుఁ దాము తప్ప వేఱెదిక్కు లే" దని దీనముగాఁ ప్రార్థించెను.

రాజు ప్రార్థనమును దేశక్షేమమును మనమున నిడికొని కాలకవృక్షియుఁ డందుల కంగీకరించెను. వెంబడినే యతఁడు దుర్మంత్రులఁ దొలఁగించి, పిమ్మట వారిపక్షీయుల నెల్ల బంధితుల గావించి యధికారవర్గము నిష్కంటకము గావించెను. మంత్రినని యహంభావము లేక రాజును వెంటఁబెట్టుకొని తన రాష్ట్రమెల్లఁ బర్యటించి ప్రజల యోగక్షేమములకై రాజుయొక్క కోశసంపద నెల్లఁ వెచ్చించెను. చెల్లింపఁదగిన ప్రజావాంఛితముల నెల్ల నెఱవేర్చుటకు బద్ధకంకణుఁడై కావించెను.

అట్లాతఁడు మున్ముందు ప్రజల మన్ననలకుఁ బాత్రుఁడై రాజుచే దేవతలెల్లఁ దృప్తిచెందుటకు వేదోక్తములగు మహాక్రతువులను జేయించెను. క్రతువులవలన నెల్లెడల వానలు గురిసెను. భూమి సస్యసమృద్ధమై ప్రజల కన్నవస్త్రములకు లోటు లేకుండఁ బాడెను. ప్రజలు మిగులఁ దృప్తిపడినవారై కాలకవృక్షియుని ధర్మబుద్ధికిని దేశోపకారమునకును, ప్రజాసేవకును మిగుల సంతసించి వేనోళ్లఁ బొగడిరి. రాష్ట్రము సుభిక్షమయ్యెను. పిమ్మట రాజు సన్మంత్రిసహాయమునను, ప్రజాదరణమునను చిరకాలము రాజ్యమేలి యనంతమైన యిహసుఖములను పరలోకసుఖమును గాంచెను.

సమాప్తము.